










ఆరెంజ్ □ పైనాపిల్ □ లైమ్ □ షాహీ గులాబ్ □ కాలా ఖట్టా □ కూల్ ఖస్ □ కేసర్ ఇలైచి □ మసాలా సోడా (జల్ జీరా) □ టూటీ ఫ్రూటీ □ మేంగో రైప్ □ గ్రేప్ గ్లోరీ

# తాజాదనం చిందించే రస్న

11 పసందైన రుచులు సరసమైన ధరలో.

Mudra:A:EAMR:4570 Tel

PARRYS

Parry's

స్నేహితులారా!
సెలవులువచ్చేశాయి. ఇది ప్యారీస్ పేజీతో వినోదించడానికి, ఆనందించడానికి సరియైన సమయమని మేము అను కుంటున్నాము. నాకు సహాయం చేస్తున్నవారు (క్రీమ్, లాలీపాప్, కాఫీ బైట్, క్యారమిల్క్) అందరూ చేరి సెలవులకి ఎంతో ఆసక్తికరమైన పేజీ తయారుచేశారు. ఇక ఈ సెలవులలో వినోదమూ, ఆనందమూ మీదే!

Parry's

THE KING OF SWEETS

## కాగితాలతో నృత్యం చేయించి చూద్దామా?

ఇదిగో ఇది ఒక కొత్త తరహా నృత్య ప్రదర్శన!
మీరు చేయవలసినది చిన్న చిన్న పాత్రల బొమ్మలు గీయాలి (9 సెం.మీ ఎత్తువుండేలాగ), అయితే పాత్రల బొమ్మలకి కాళ్లు మాత్రం వుండకూడదు (చిత్రం 1 చూడండి). ఆ పాత్రల బొమ్మలు వేసిన వెంటనే వాటికి రంగులు వేసి, ఆకారం వచ్చేలా కత్తిరించండి. కాళ్లు వుండవలసిన చోట జాగ్రత్తగా రంధ్రాలు కత్తిరించండి (చిత్రం 2 చూడండి). ఇప్పుడు మీ చేతి మొదటి వేలుని మరియు రెండవ వేలుని కన్నాలలోంచి దూర్చండి. (చిత్రం 3 చూడండి). ఆ తర్వాత ఒక పాత్రని మీ ఎడంచేతి వేళ్లతో నృత్యం చేయించండి. అలాగే మరొక పాత్రని కుడిచేతి వేళ్లతో నృత్యం చేయించండి.

మీరు మీ స్నేహితులచేత కూడా కాగితాలతో నృత్యం చేసే పాత్రలని చేయించవచ్చు. అప్పుడు నృత్యాల పోటీని కూడా నిర్వహించవచ్చు!

Fig: 1

Fig: 2

Fig: 3

CUT AND KEEP

# PAGE

ప్యారీస్ మిఠాయిలు మరియు బిస్కట్లు అందరికీ ఇష్టం

## పాముని ఆడించడంఎలా?

మీరు పాములవారు నాగస్వరం ఊదుతూ పాము చేత నృత్యం చేయించడం చూసే వుంటారు. అయితే పాములు సంగీతం కాని మరేశబ్దంకాని వినలేవని మీకు తెలుసా! పాములు చెవిటివి! పాములవారు నాగస్వరం ఊదేటప్పుడు తన పాదాన్ని నేలమీద తాటించుతూ అటు యిటూ కదుపుతూ వుంటారు. ఆ కదలికలకి పాము కూడా సరిగ్గా కదులుతూ పాములవారు ఎలా కదిలితే అలా కదులుతూ వుంటుంది. మనకి మటుకు నాగస్వరానికి నృత్యం చేస్తున్నట్లు వుంటుంది!





**జన్మదిన శుభవార్త!** : మన పుట్టినరోజువారు ప్రపంచంలో సుమారు తొంభయి లక్షలమంది కూడా పుట్టిన రోజు జరుపుకుంటూ వుంటారని మీకు తెలుసా! ఈ సారి మీ పుట్టిన రోజు వచ్చినప్పుడు...ఒక్కసారి ఆలోచించండి, తొంభయి లక్షలమంది వారి పుట్టినరోజు కూడా జరుపుకుంటూ వున్న సంగతి. ఎంత ఆశ్చర్యంగా వుంది!



## ఛూ మంత్రకాళి, ఇది పెన్సిల్ మ్యాజిక్!

ఒక పెద్దగ్లాసులో కొంచెం నీళ్లుపోయండి. ఒక పెన్సిల్‌ని గ్లాసు వెనకాల వుంచండి. ఇప్పుడు మీరు నీళ్లలోంచి చూస్తే మీకు ఎంతో ఆసక్తికరమైన విషయం కనిపిస్తుంది — హఠాత్తుగా రెండు పెన్సిళ్లు ప్రత్యక్షమవుతాయి! మీరు కుడి కన్ను మూసుకుంటే, ఎడమ ప్రక్కన వున్న పెన్సిల్ మాయమవుతుంది. మీరు ఎడమ కన్ను మూసుకుంటే కుడి వైపునవున్న పెన్సిల్ మాయమయిపోతుంది. దీనికి కాంతి నీటిలో వక్రీభవనం చెందడం కారణం. (మీరు భౌతిక శాస్త్రంలో ప్రకాశ వక్రీభవనం గురించి చదివే వుంటారు. సూక్ష్మంగా చెప్పాలంటే, నీళ్లలోంచి, గాజులోంచి కాంతి కిరణాలు వెళ్ళినప్పుడు వాటి మార్గం మారుతుంది). ఇప్పుడు మీరు మీ స్నేహితులకి నేనొక ఇంద్రజాలికుడినని చెప్పవచ్చు!






THE KING OF SWEETS

HTA 7245





# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి


ఈ నెల బేతాళకథ ["సీసాలో భూతం"]కు ఆధారం, జొన్నలగడ్డ రామలక్ష్మి రచన. సహజంగా మనిషి తన కెదురయ్యే సమస్యలను హేతుబద్ధంగా, ఆలోచించి పరిష్కరించుకునేందుకు ప్రయత్నిస్తాడు. అలా కాక కేవలం నమ్మకం, విశ్వాసాల మీద ఆధారపడేవాళ్ళను, స్వార్థపరులు ఎలా మోసగించగలరో "రాపాశుడు" అన్న కథలో తెలుసుకుంటాం.

## అమరవాణి

దూరేపి పరస్యాగసి, పటుర్జనో నాత్మనః సమీపేపి,
స్వం ప్రణమక్షి న పశ్యంతి, శశిని కళంకం నిరూపయతి.

[తమలోని లోపాలను కప్పిపుచ్చి, ఎక్కడో వున్న పరుల లోపాలను చూపడంలో కొందరు నేర్పరులు. కళ్ళు, తమలోని నలుపు రంగును చూడజాలవు కాని, ఆకాశంలో వున్న చంద్రుడి మచ్చను చూడగలుగుతున్నవి కదా!]


సంపుటి 84 మే '89 సంచిక 5

విడి ప్రతి : 3-00 : : సంవత్సర చందా : 36-00




# గ్రామాధికారి మూఢత్వం

వంశపారంపర్యతకారణంగా, వృషభేంద్రయ్య అనే అతను గ్రామాధికారి అయ్యాడు. అతను ఒట్టి మూఢుడు. ఒకసారి రైతొకడు ఆయన దగ్గిరకు వచ్చి, "అయ్యా, నా పంటపొలంలో ఆంబోతొకటి పడిమేస్తున్నది. ఎలాగయినా దాన్ని బయటికి తరిమే మార్గం చూడండి," అని కోరాడు.

"మనిషిని పంపి తరిమేయిస్తాను," అన్నాడు గ్రామాధికారి.

"వాడు పంటంతా తొక్కేస్తాడేమో!" అన్నాడు రైతు.

"అయితే, వాణ్ణి చేను మధ్యకు మోసుకుపోవడానికి, ఇద్దరు మనుషుల్ని ఏర్పాటు చేస్తాను," అన్నాడు గ్రామాధికారి.

రైతు విసుక్కుంటూ అక్కడి నుంచి వెళ్ళిపోయాడు.

మరొకసారి, ఊళ్ళోవాళ్ళు ఆయన్ని ఆటపట్టించాలని, "అయ్యా, మన శివాలయాన్ని ఒక గజం వెనక్కు జరిపితే బావుంటుందన్నది, ఊరి ప్రజల ఏకాభిప్రాయం!" అని చెప్పారు.

"దానిదేముంది!" అని గ్రామాధికారి, ఒక వందమంది మనుషులను పిలిపించి, ఆలయాన్ని వెనక్కు తోయమని చెప్పి, గుర్తుగా వుండేందుకు తన తలపాగాను, ఆలయం వెనక ఒక గజం దూరంలో పెట్టాడు.

జనం ఆలయాన్ని వెనక్కు తోస్తున్నట్టు కొంతసేపు గొడవచేసి, గ్రామాధికారితో, "అయ్యా, యిప్పుడు చూడండి, ఆలయం వెనక్కు జరిగిందో లేదో!" అన్నారు.

గ్రామాధికారి ఆలయం వెనక్కు వెళ్ళాడు. ఆయన తలపాగా అక్కడ లేదు. ఎవరో దొంగిలించారు. ఆయన పరుగు, పరుగున జనం దగ్గిరకువచ్చి, "ఒరే, ఇక ఆగండి! ఆలయాన్ని గజం కాదు, రెండు గజాలు వెనక్కు తోశారు. నా తలపాగా దానికింద పడిపోయింది!" అన్నాడు.

—కొండూరు పరిమళ





# ఉడకని ఉల్లిపాయ

కేశవరం అనే గ్రామంలో రాముడు, భీముడు అనే ఇద్దరన్నదమ్ములు, తమ ఇంటిని రెండు వాటాలుగా చేసుకుని వేర్వేరుగా వుంటున్నారు. ఇద్దరిలో రాముడు కాస్త అమాయకుడు. చిన్నవాడయిన భీముడు గడుసరి.

ఒక రోజున బైరాగి ఒకడు, వాళ్ళింటికి వచ్చి భోజనం పెట్టమన్నాడు. భీముడు, బైరాగిని కసిరికొట్టాడు. రాముడు ఆదరించి అన్నం పెట్టగా, అందుకు బైరాగి ఎంతో సంతోషించి, ''నీకేమైనా కోర్కెలుంటే చెప్పు, తీరుస్తాను,'' అన్నాడు.

''నా తమ్ముడు భీముడు నాకంటే వైభవంగా వుంటున్నాడు. అదే వైభవం నాకూ కావాలి,'' అన్నాడు రాముడు.

బైరాగి వెంటనే, ''నీ ఇంట్లో కూరగాయలేమైనా వుంటే తీసుకురా!'' అన్నాడు.

రాముడు ఇల్లంతా వెదికితే, నాలుగు ఉల్లిపాయలు మాత్రం దొరికాయి. బైరాగి, రాముడితో, ''ఈ నాలుగు ఉల్లిపాయల్ని నీళ్ళల్లో వేసి ఉడకబెట్టు. ఉడికినవి తినేసి, ఉడకనివి వదిలిపెట్టి నా దగ్గరకు రా,'' అన్నాడు.

రాముడు, బైరాగి చెప్పినట్లే ఉల్లిపాయల్ని ఉడకబెట్టాడు. ఒక్కటంటే ఒక్కటి తప్ప మిగతావన్నీ ఉడికాయి. రాముడు ఉడికినవాటిని తినేసి బైరాగి వద్దకు వెళ్ళాడు.

బైరాగి జరిగింది విని, ''నువ్వు చాలా అదృష్టవంతుడివి. ఈ రాత్రికి నేనిక్కడే పడుకుంటాను. తెల్లవారి లేచాక, ఆ ఉడకని ఉల్లిపాయ నీవు కోరినవన్నీ యివ్వడం మొదలుపెడుతుంది,'' అన్నాడు.

బైరాగి పడుకునేందుకు ఏర్పాట్లు చేశాడు రాముడు. తర్వాత ఇద్దరూ నిద్రలో

"వసుంధర"



వుండగా, ఇంట్లోకి భీముడు ప్రవేశించాడు. రాముడు, బైరాగిని భోజనానికి పిలిచి నప్పటి నుంచీ, అక్కడేం జరుగుతుందో అని భీముడు పొంచివుండి విన్నాడు. ఉడకని ఉల్లిపాయ రాముడికి ఉపయోగ పడకూడదనే కుత్సితబుద్ధితో వాడు, దాన్ని గుటుక్కున మింగి, తన ఇంట్లోకి వెళ్ళి పడుకున్నాడు.

మర్నాడుతెల్లవారగానేలేచిన రాముడు, ఉడకని ఉల్లిపాయ కనిపించక లబోదిబో మన్నాడు.

బైరాగి వాడిని ఊరడించి, "కంగారు పడకు. అంతా నీ మేలుకే జరిగింది. ఉత్త ఉల్లిపాయ నీ కోర్కెలేం తీర్చ గలదు? నా మంత్రశక్తికి లోబడి ఎవడో దాన్ని మింగాడు. ఆ ఉల్లిపాయ వేణ్ణీళ్లకు ఉడకదు. శరీరంలో అరగదు. నీకేం కావాలనిపించినా, "ఉడకని ఉల్లిపాయా! నాకు ఫలానిది కావాలి," అని గట్టిగా అను. ఆ ఉల్లిపాయను మింగినవాడు వెంటనే వచ్చి, నీ కోర్కె తీరుస్తాడు. నువ్వు మాత్రం అత్యాశకు పోకూడదు. నీ కోర్కెలు తీర్చేవాడి శక్తికి మించిన కోర్కెలు అడగకూడదు. మళ్ళీ ఆరు మాసాల తర్వాత వస్తాను. అప్పుడు నిన్ను, నేను సంతోషంగా చూడాలి!" అన్నాడు.

రాముడు, బైరాగి కాళ్ళకు వంగి నమస్కరించాడు. బైరాగి వెళ్ళిపోగానే వాడు గట్టిగా, "ఉడకని ఉల్లిపాయా! నాకు పట్టుపరుపులమంచం కావాలి," అన్నాడు.

కొద్దిసేపట్లో భీముడు వచ్చి, వాడింట్లో పట్టుపరుపుల మంచం ఏర్పాటు చేసి వెళ్ళాడు.

ఆ ఉల్లిపాయను మింగింది, తన తమ్ముడు భీముడేనని తెలియగానే రాముడికి కలిగిన సంతోషంఅంతా యింతా కాదు. భీముడు లోగడ రాముణ్ణి మోసం చేసి తండ్రి నుంచి సంక్రమించిన ఆస్తిని చాలావరకు కాజేసి వున్నాడు. రాముడికి అప్పట్లో వుండే, యీ పట్టుపరుపుల

మంచం, వాడి దగ్గిర నుంచి భీముడు చాలా చవగ్గా కొనేశాడు.

''ఉడకని ఉల్లిపాయా! ఇప్పుడు నాకు వంద వరహాలు కావాలి,'' అన్నాడు రాముడు.

కాసేపట్లో భీముడు వచ్చి, వాడికి వంద వరహాలూ యిచ్చి వెళ్ళాడు. ఒకప్పుడు రాముడు, భీముడి వద్ద వందవరహాలు దాచుకుంటే, తర్వాత తనకేం తెలియదని అబద్ధం ఆడాడు భీముడు.

రాముడి కిప్పుడు రోజులు చాలా సుఖంగా జరిగిపోతున్నవి. ఉడకని ఉల్లిపాయ ధర్మమా అని, భీముడు వాడికి రోజూ భోజనం ఏర్పాట్లు చేస్తున్నాడు. ఇల్లు శుభ్రం చేస్తున్నాడు. ఇంట్లోకి అవసరం అయిన సరుకులు కొని పెడుతున్నాడు. ఇందుకోసం భీముడు వెనకటికన్నా చాలా కష్టపడి పని చేయవలసి వచ్చేది. అయితే వాడికి శ్రమకుతగ్గ ఫలితం దొరికేది. అన్నగారికి అన్నీ చేసి పెడుతున్న భీముడిని ఊళ్ళో అందరూ ఎంతగానో మెచ్చుకునేవారు. అభిమానంకొద్దీ వాడికి ఎక్కువ ప్రతిఫలం యిచ్చేవారు.

ఇలా ఆరునెలలు గడిచాక, బైరాగి మళ్ళీ ఆ ఊరు వచ్చి రాముణ్ణి కలుసుకున్నాడు. రాముడు, బైరాగికి తను చాలా సంతోషంగా వున్నట్టు చెప్పాడు. అప్పుడు బైరాగి, భీముణ్ణి పిలిచాడు.

వాడు వస్తూనే బైరాగి కాళ్ళ మీదపడి, ''అయ్యా, నేనిప్పుడు యిద్దరు మనుషుల





కోసం అతిగా శ్రమపడవలసి వస్తున్నది. నా తప్పులన్నీ క్షమించి, ఈ కష్టం నుంచి బయటపడే ఉపాయం చెప్పండి,'' అని వేడుకున్నాడు.

బైరాగి నవ్వి, ''నాయనా, చెడ్డవాళ్లను శిక్షించడంలోనే, మంచివాళ్ళకు మేలు జరగాలని, నేను ఉడకనిఉల్లిపాయను సృష్టించాను. నీవిప్పుడు నీ అన్న దగ్గిరకు వెళ్ళి, అతడిచేత, 'ఉడకని ఉల్లిపాయా! నువ్వు నాకు చేసిన మేలు చాలు. ఇక అరిగిపో,' అనిపించు. అంతే, ఉల్లిపాయ జీర్ణమైపోతుంది. ఆ తర్వాత నుంచి మీరిద్దరూ ఎవరికివారుగా జీవించవచ్చు,'' అన్నాడు.

''ఉల్లిపాయను జీర్ణం చేయడానికి నా అన్న ఒప్పుకోకపోతే, నేనేం చేయాలి?'' అన్నాడు భీముడు దీనంగా.

''అత్యాశకు పోయేవాళ్ళను నేను క్షమించను. నీ అన్న అందుకు అంగీకరించకపోతే, ఉల్లిపాయ నీ కడుపులో మాయమై, నీ అన్న శరీరంలోకి వెళుతుంది. అప్పుడు నీకు కావలసినవన్నీ నీ అన్న చేసి పెడతాడు. నీవు అత్యాశకు పోనంతకాలం మాత్రమే అలా జరుగుతుంది. ఆ తర్వాత ఉల్లిపాయ మళ్ళీ నీ శరీరంలోకి మారిపోతుంది. కాబట్టి నీ సమస్యను నువ్వే పరిష్కరించుకో, ఇక వెళ్ళు!'' అని బైరాగి అక్కడి నుంచి వెళ్ళిపోయాడు.

భీముడు అన్న దగ్గిరకు వెళ్ళి, బైరాగి చెప్పినట్లే కోరాడు. రాముడు వాడితో, ''నాకింకా తృప్తికలగలేదు. అందువల్ల ఉల్లిపాయ జీర్ణం కావడానికి వీల్లేదు,'' అన్నాడు.

''అన్నయ్యా! అత్యాశకుపోతే అనుభవిస్తావు. నా మాట విను. ఉడకని ఉల్లిపాయ నాలో జీర్ణమైపోవాలని కోరుకో!'' అన్నాడు భీముడు.

రాముడు మంచివాడే అయినప్పటికీ, కోరగానే వచ్చే సుఖాలను వదులుకోలేక స్వార్థపరుడయ్యాడు. వాడు తమ్ముడి

మాటలు వినకుండా, "ఉడకని ఉల్లి పాయా! నాకొక వందవరహాలు తెచ్చి పెట్టు," అన్నాడు.

ఆ మరుక్షణం భీముడి నోట్లోనుంచి ఉల్లి పాయ ఒకటి బయటకు వచ్చి, రాముడి నోట్లో ప్రవేశించింది. అప్రయత్నంగా రాముడు దాన్ని మింగేశాడు.

"చూశావా, నేను ముందుగా హెచ్చరిస్తే వినలేదు. ఇకనుంచి నువ్వు, నా కోర్కెలు తీర్చుతావు. అనుభవించు!" అన్నాడు భీముడు.

రాముడు భయంతో వణికిపోతూ, "ఇలా జరుగుతుందని నాకు తెలియదు. నేను అత్యాశకుపోయిన మాట నిజం. నాకు బుద్ధి వచ్చింది. నన్నిక వదిలి పెట్టు," అన్నాడు.

"నేనిప్పుడు మునుపటి భీముణ్ణి కాదు. మారిపోయాను. కష్టపడి పనిచేయడంలోని సుఖాన్నీ, మంచిగా వుండడంలోని గొప్ప తనాన్నీ తెలుసుకున్నాను. ఇక నుంచి మనిద్దరం విడిగా కాక కలిసి మెలిసి వుందాం," అని భీముడు గట్టిగా, "ఉడకని ఉల్లిపాయా! అరిగిపో," అన్నాడు.

భీముడిలో వచ్చిన మార్పుకు, రాముడు ఆశ్చర్యపోతూ, "నువ్వు మళ్ళీ నా నుంచి అన్నీ రాబట్టుకుంటావనుకున్నాను. నీలో యింత మార్పు వచ్చినప్పుడు, మంచి వాడిననిపించుకునే నేను అత్యాశకు పోవడం క్షమించరానిది. నువ్వు నాకిచ్చిన వన్నీ తిరిగి, నీకిచ్చేస్తాను," అన్నాడు.

"మన మిద్దరం కలిసివున్నప్పుడు నీది, నాది అన్న భేదమెందుకు? ఇద్దరం కలిసి కట్టుగా వుండి కష్టపడి పనిచేస్తే, ఏ ఉల్లి పాయ అవసరం లేకుండానే మనం గొప్ప వాళ్ళం కావచ్చు," అన్నాడు భీముడు.

ఈ అన్నదమ్ముల కథ ఊళ్ళో వాళ్ళకు తెలిసింది. రాముడూ, భీముడూ అన్యోన్యంగా వుంటూ త్వరలోనే చాలా అభివృద్ధిలోకి వచ్చారు. మనుషులందరూ ఇలా వుంటే, ఏ బైరాగులూ మహిమలు చూపించనవసరం లేదనుకున్నారు కేశవరం గ్రామస్థులు.





# వ్యాపార నైజం

ఒక ఊళ్ళో చలపతి అనే రైతుకు, ముగ్గురు కొడుకు లుండేవారు. వాళ్ళకు తెలివితేట లెక్కువ. అయితే, వాళ్ళలో ఒక లోపం వుండేది. వాళ్ళు తండ్రికి వ్యవసాయప్పనుల్లో ఏమాత్రం సాయ పడక, ఏవో వ్యాపార విషయాల గురించి మాట్లాడుకునేవాళ్ళు. క్రమంగా ఈడు వచ్చేసరికి ఈ ధోరణి ముదరబారింది. చలపతి ఎలాగైనా తన కొడుకుల్లో మార్పు తేవాలని నిశ్చయించుకున్నాడు.

చలపతికి ముగ్గురు ప్రాణస్నేహితు లున్నారు. వారిలో ఒకడు కవి. రెండవ వాడు రాజకీయవేత్త. మూడవవాడు మత బోధకుడు. వీళ్ల సహాయంతో, కొడుకులలో మార్పు తేవాలని అయన అనుకున్నాడు.

అయన ముందుగా కవి అయిన తన మిత్రుణ్ణి కలుసుకుని, తన పెద్దకొడుకును గురించి చెప్పి, "నువ్వే ఎలాగైనా మా వాడిని బాగుచెయ్యాలి!" అని పెద్ద కొడుకును, అయనకు అప్పగించాడు.

అదేవిధంగా చలపతి సంగతి వివరించి, రెండోవాణ్ణి రాజకీయవేత్తకూ, మూడోవాణ్ణి మతబోధకుడికీ అప్పగించాడు.

చలపతి పెద్దకొడుక్కు మొదట్లో, ఈ సాహితీ వ్యాసంగం నచ్చలేదు. కాని, క్రమంగా వాడు దానికి అలవాటుపడ్డాడు. చూడగా, గురువుగారి ఆర్థికపరిస్థితి వాడికి దుర్భర మనిపించింది. వాడు తన గురువులా కాకుండా, ఆ ఊళ్లోని కవుల్నీ, రచయితల్నీ చేరదీసి సాహితీ సంస్థ నొక దాన్ని నెలకొల్పాడు.

వాళ్ళల్లో కొందరు, వాడి గురువులాగా డబ్బు యిబ్బందుల్లో వున్నవాళ్ళు. మరి కొందరు కీర్తికాంక్ష కలవాళ్ళు. పెద్దవాడు వాళ్ళ దగ్గిరనుంచి మంచి రచనలు కొని, వాటిని అమ్మి మంచి లాభాలు సంపాదిం

డా॥ కాటిచర్ల గురురామప్రసాద్

చాడు. కొందరు అనామకుల రచనలను, తన పేరుతో ప్రకటించుకున్నాడు. వాడి పక్కన చేరిన వందిమాగధులు, వాడికి ఘనంగా సన్మానం చేసి, కవికిశోరం అన్న బిరుదిచ్చారు.

ఇదంతా గమనిస్తున్న కవి, పెద్దవాడి తండ్రితో, వాడి వ్యాపారనైజాన్ని మార్చడం తనవల్ల కాదని చెప్పేశాడు.

అదేసమయంలో, రాజకీయవేత్త వద్ద చేరిన చలపతి రెండో కొడుక్కు, రాజకీయపుటెత్తులూ, ప్రజల సమస్యలూ తలనొప్పిగా తోచాయి. రాజకీయవేత్త మాత్రం, వాడికి రాజకీయాలపట్ల అభిరుచి కలిగించడానికి చాలా శ్రమపడ్డాడు. రెండోవాడికి క్రమంగా రాజకీయాల నిజస్వరూపం బోధపడింది. వాడు స్థానిక నాయకులతో పరిచయాలు పెంచుకున్నాడు. ప్రజల బలహీనత లేమిటో పసిగట్టాడు. పిరికివాళ్ళను బెదిరించాడు. ధైర్యవంతుల ముందు వినయం నటించాడు. కులమతద్వేషాలను రెచ్చగొట్టాడు. ఎన్నికలలో డబ్బూ, అవసరం కలిగిన చోట, తన సహచరులతో బలప్రయోగం చేయించి ప్రజాప్రతినిధి అయ్యాడు.

ఇది చూసి రాజకీయవేత్త బెంబేలు పడిపోయి, చలపతితో, "మిత్రమా, మరేమీ అనుకోకు. నీ రెండో కొడుకు యిప్పుడు నన్నుమించి ఎదిగిపోయాడు. వాడిని బాగుచేయడం, నావల్ల కాదు," అని తన నిస్సహాయతను వెల్లడించాడు.



ఈలోగా, మతబోధకుడి వద్ద చేరిన చలపతి మూడవ కొడుకుతో ఆయన, "నువ్వు నావద్ద చేరడంలో చాలా మంచి పని చేశావు. ఐహిక విషయాలలో దేనిలోనైనా, వ్యాపార ధోరణి ఎక్కువ. నీ మనసును మార్చడానికి మతమే తగిన మందు!" అంటూ తల నిమిరాడు.

చలపతి మూడో కొడుక్కు, ఆ మత బోధకుడి భక్తి అవేశం చూసి, చాలా ముచ్చట వేసింది. అయితే, ఆయన బోధనలేవీ వాడి బుద్ధికి రుచించలేదు. వాడు క్రమంగా భక్తబృందాలతో పరిచయాలేర్పరచుకున్నాడు. భక్తకోటిలోని బలహీనతలు, వాడికి బాగా అర్థమైనాయి. అసమర్థులు అశాంతిలో అలమటించడం, వాడు గ్రహించాడు.

తన గురువుగారికి లేని మహిమలు, ఉన్నట్టు వాడు ప్రచారం చేశాడు. చందాలు వసూలుచేసి, ఆయన వద్దంటున్నా వినక, ఒక గుడి కట్టించాడు. భక్తుల రాకపోకలు ఎక్కువయినై. వాళ్ళిచ్చే కానుకల సంరక్షణకూ, దేవాలయ నిర్వహణకూ, ధర్మకర్తృత్వమండలి ఏర్పడింది. వాళ్లందరూ ఏకగ్రీవంగా మూడోవాణ్ణి పెద్దగా ఎన్నుకున్నారు. వచ్చే ఆదాయంలో కొంత భాగాన్ని పేదలకు దానం చేస్తూ, వాడు ధర్మశిరోమణి అన్న పేరు తెచ్చుకున్నాడు.

మతబోధకుడైన చలపతి మిత్రుడు, ఆయనతో సంగతి చెప్పి, "నీ కొడుకు మనస్తత్వంలో మార్పు తేవడం, నాకే కాదు—లోకంలో మరెవరికీ సాధ్యపడదు. వాడిది బొత్తిగా వ్యాపారనైజం!" అని తన నిస్సహాయతను వెల్లడించాడు.

ఈవిధంగా ముగ్గురు కొడుకులూ, ఇంటికి తిరిగిరాగానే, చలపతి బాగా ఆలోచించి, వాళ్ళకు కొంత డబ్బిచ్చి నగరానికి పంపాడు. వాళ్లక్కడ వ్యాపారం ప్రారంభించి కొద్దికాలంలోనే కోట్లకు పడగలెత్తారు.

వ్యాపారం నూనెలాంటిది. అది దేనితోనూ కలవదు; వ్యాపారంతోతప్ప—అని చలపతి గ్రహించాడు.






ఒకనాడు లక్ష్మిఅమ్మవారు, తన భర్త అయిన శ్రీ సత్యనారాయణస్వామి వారిని, ''ఏమండీ, ఎన్నో లక్షలమంది మిమ్మల్ని నిత్యమూ ఎన్నో కోరికలు కోరుతూంటారు. పాపం, వాళ్ళ కోరికలు తీర్చరేం?'' అని అడిగింది.

ఇందుకు స్వామివారు చిరునవ్వు నవ్వి, ''అర్హతానర్హతలు చూడకుండా, నేను ప్రతివాడి కోరికా తీర్చడం మొదలు పెడితే, వాళ్ళకు సుఖం వుండదు. ఫలానా కోరిక కోరేందుకు తాము అర్హులమో కాదో అన్న సంగతి తెలియక, వాళ్ళు రకరకాల కోరికలు కోరుతూంటారు. వాళ్ళ క్షేమం కోరేవాణ్ణి గనక, నేను కొందరి కోరికలు తీర్చడం లేదు,'' అన్నారు.

అమ్మవారికి, ఈ సమాధానం తృప్తి కలిగించలేదు. అది గ్రహించిన స్వామి వారు, ఆమెతో, ''అయితే, విను! ఒక ఊళ్ళో సూరయ్య అనే అతనున్నాడు. ఆయనకు పిల్లలు లేక, భార్యతో సహా నన్ను ప్రార్థించాడు. నేనా సూరయ్యకు ఒక కొడుకు నిచ్చాను. వాడికి వాళ్ళు సత్యనారాయణ అని పేరు పెట్టు కున్నారు. వాడు పుట్టిన కొద్దికాలానికే, తల్లి పోయింది. సూరయ్యకు కొడుకును పెంచటం చేతకాలేదు. వాడు పొట్టి గడుగ్గాయగా తయారయాడు. తండ్రికీ కొడుకుకూ మధ్య పెద్ద అగాధం ఏర్పడ్డది. కొడుకు తన కడుపున పుట్టవలసినవాడు కాదనుకుంటాడు తండ్రి. తండ్రి తనకు




గర్భశత్రువనుకుంటాడు కొడుకు. వాళ్ళిద్దరికీ సుఖం లేదు,'' అన్నాడు.

''పాపం. వాళ్ళకు మరోవరం ఏదైనా ఇచ్చి, వాళ్ళను ఒకఒడ్డు చేర్చండి,'' అన్నది అమ్మవారు.

అమ్మవారి మాట కాదనలేక స్వామి వారు 'సరే'నని ఒప్పుకున్నారు.

* * *

ఆ రోజు సత్యనారాయణ బడి ఎగగొట్టి మధ్యాన్నం వేళకే ఇంటికి వచ్చాడు.

''అప్పుడే వచ్చావేమిట్రా ?'' అన్నాడు తండ్రి.

''నాకు కడుపులో నొప్పిగా ఉంది,'' అన్నాడు కొడుకు.

''వంటలక్క గారెలూ, అవడలూ చేసింది. అవి తినే గీతలేదు నీకు. పోయి గదిలో పడుకో,'' అని సూరయ్య సత్యాన్ని గదిలోకి నెట్టి బయట గొళ్ళెం పెట్టాడు.

గది లోపల సత్యమూ, గది ఇవతల సూరయ్యా కూడా ఆలోచనల్లో పడ్డారు.

''చిన్నతనం ఎంత సుఖమయమైనది. బడికి వెళ్ళటమూ, పాఠాలు చదుకోవటమూ, హాయిగా ఇంత తిని తిరగటమూ ఎంత ఆనందంగా ఉంటుంది. ఇల్లూ, వాకిలీ, డబ్బూ, దసకమూ అంటూ విచారం లేదు. అజీర్తి బాధలేదు. నా కొడుకు వొట్టిరాలుగాయి అయినాడు గాని, నేనే వాడి ఈడువాడినైతేనా? ఎంత చక్కగా బడికి పోదును!'' అనుకున్నాడు సూరయ్య.

గదిలో సత్యం కూడా తన ధోరణిలో తాను ఈ విధంగా అనుకోసాగాడు.

''వెధవ బడి, వెధవ చదువు, వెధవ పాఠాలు! ప్రతిదానికీ పెద్దవాళ్ళ నిర్బంధమే. వాళ్ళని కోప్పడేవాళ్ళు లేరు. వాళ్ళు కావలసినన్ని గారెలూ, అవడలూ తినవచ్చు. బళ్ళోకి పోనక్కర్లేదు. ఎక్కడికి పడితే అక్కడికి పోవచ్చు. నేనే మా నాన్నల్లే పెద్దవాడినైతేనా ?''

''పాపం, వాళ్ళిద్దరికోరికా తీర్చండి,'' అన్నది అమ్మవారు.

స్వామివారు మందహాసం చేసి అమ్మ వారి కోరిక చెల్లించారు.



*   *   *

గది బయటఉన్న సూరయ్యకు సత్యం రూపం వచ్చేసింది. గదిలో ఉన్న సత్యానికి తండ్రి స్వరూపం వచ్చేసింది. కాని ఈ మార్పు జరిగినట్టు ఇద్దరికీ తెలియదు.

తండ్రి అయిన సూరయ్య వీధిలోకి వెళ్ళాడు. ఇళ్ళన్నీ చాలా ఎత్తుగా అయిపోయినట్టు తోచింది. తల ఎత్తితేగాని రెండు అంతస్తులు కూడా కనిపించలేదు. కాని, దీన్ని గురించి సూరయ్య అటే వితర్కించలేదు.

వీధిలో తన పాతస్నేహితుడు గోపాలం కనిపించాడు సూరయ్యకు. "ఏంరా, గోపాలం?" అని పలకరించాడు సూరయ్య.

గోపాలం చాలా విచిత్రంగా ప్రవర్తించాడు. మామూలుగా సమాధానం చెప్పటానికి బదులుగా కళ్ళెర్రచేసి, "ఓరి, పిడుగా, అంత పొగరెక్కిందిరా. ఉండు మీ నాన్నతో చెప్పి తాటవొలిపిస్తా!" అంటూ కర్రఎత్తి భయంకరంగా మీదికి వచ్చాడు గోపాలం.

సూరయ్యకు భయం వేసి పరిగెత్తాడు. అంతవేగంగా పరిగెత్తగలిగినందుకుతనకే ఆశ్చర్యం వేసింది. చిన్నతనంలో ఎప్పుడు పరిగెత్తాడో ఏమోగాని ఇటీవల సూరయ్య గబగబా నడిచిన పాపాన కూడా పోలేదు. ఎందుచేతనంటే శరీరం అంతో ఇంతో లావెక్కింది. తనకన్న సన్నగా ఉండే గోపాలం తనతో పరిగెత్తలేక పోవటం చూసి ఆశ్చర్యపడ్డాడు సూరయ్య.

ఆయన పరిగెత్తటం మానేసి ఆగి, "ఎందుకు నేనిట్లా పరిగెత్తుతున్నాను. గోపాలం నన్ను కొట్టటమేమిటి? నేను పారిపోవటమేమిటి?" అనుకుంటూ విరగబడి నవ్వసాగాడు.

ఇంతలో ఎవరో భుజం మీద గట్టిగా చరిచి, "ఒరే, ఇందుకేనా నువు బడి ఎగగొట్టింది?" అని అడిగాడు.



సూరయ్య ఉలిక్కిపడి చూస్తే ఏడెనిమి దేళ్ళ కుర్రవాడు తన మొహంలోకి చూసి కొంటెగా నవ్వుతున్నాడు.

వాడి మొహం చూడగానే సూరయ్యకు మండిపోయింది.

"మీద చెయ్యి తీస్తావా? ముక్కలు విరగదన్నమంటావా? ఎవడురా నువ్వు?" అన్నాడు సూరయ్య.

"నీకెంత పొగరెక్కిందిరా? ఇవాళ బడి ఎగేసినందుకు రేపు పంతులుగారు నిన్నేం చేస్తాడో చూడు," అంటూ ఆ కుర్రవాడు కోపంగా వెళ్ళిపోయాడు.

ముక్కుపచ్చలారని కుర్రవెధవ తనతో అంత పొగరుగా మాట్లాడినందుకు సూరయ్యకు అమితాశ్చర్యంతో నోటమాట రాలేదు.

సూరయ్య నడివీధిలో నిలబడి ఆశ్చర్య పడటానికి వేళలేదు. ఇంటికి కావలిసిన సరుకులు వెచ్చాల అంగడిలో కొనిపంపాలి. షావుకారు సుబ్బయ్య దుకాణానికి వెళ్ళి సూరయ్య, "ఏం, సుబ్బయ్యా, ఒక అర బస్తా బియ్యమూ, పదిశేర్లు కందిపప్పూ, ఐదుశేర్లు పెసరపప్పూ, రెండు ఎత్తులు చింతపండూ కావాలి," అన్నాడు.

"దానికేం భాగ్యంలేగానీ, డబ్బు లేవీ?" అన్నాడు సుబ్బయ్య చిన్నగా నవ్వుతూ.

సూరయ్యకు చాలా కోపం వచ్చింది. తనతో సుబ్బయ్య అట్లా మాట్లాడతాడా? అంత కోపంలో కూడా సూరయ్య జేబు తడువుకుంటే డబ్బుల సంచీ లేదు. జేబులో విరిగిన సీమసున్నం ముక్కా, దారమూ, చిన్న బలపమూ, ఒక నెమలి ఈకా, గుడ్డల తాను మీద చించుకొన్న బొమ్మలూ దొరికాయి.

ఈసారి సూరయ్య ఆశ్చర్యానికి మేర లేదు. ఏదో మోసం జరిగినట్టు స్పష్ట మయింది. ఎన్నడూ లేనిది విపరీతమైన ఆకలి కూడా వేస్తున్నది. ఫలహారాల అంగడికి పోయి తిందామంటే కూడా దగ్గిర కానీ లేదు. ఆ అంగడి దగ్గిర నిలబడి

లోపల చాలా సంతోషంగా గారెలూ, కారపుబూందీ, రవ్వట్లూ తినేవాళ్ళని చూశాడు.

ఇంతలో ఆయన దృష్టి అక్కడి వాకిలికి పెట్టిన అద్దం తలుపు మీద పడింది. అందులో తన ప్రతిబింబం కనిపించింది. కాని అది తన బొమ్మ కాదు తన కొడుకుది.

మొదట తన కళ్లను తానే నమ్మలేక పోయాడు. వంగి కాళ్ళకేసి చూసుకున్నాడు. కాళ్ళు చిన్నవిగా ఉన్నాయి. చెప్పులు లేవు. ధోవతికి బదులు లాగు కనిపించింది. నెత్తి తడువుకున్నాడు. నున్నని బట్టతల ఉండవలసిన చోట మెత్తని జుట్టున్నది. మొహం తడుముకున్నాడు; మీసాలు లేవు. గడ్డం నున్నగా ఉంది. కళ్ళకు జోడులేదు. కాని చూపు చక్కగానే అనుతున్నది.

ఇప్పటికి సూరయ్యకు తనలో జరిగిన మార్పు అర్థమయింది. తను తన కొడుకుగా మారితే, తన కొడుకేమయినట్టు? ఈ ప్రశ్న కలగగానే ఆయనకు భయం వేసింది.

ఈ లోపుగా సత్యం మాటేమిటి? తన తండ్రి బయటికి వెళ్ళిపోయి ఉంటాడని రూఢిచేసుకుని సత్యం తలుపు కాళ్లా చేతులా తన్నాడు. కాని అవి ఎందుకో చాలా నొప్పిపుట్టాయి. ఇంతలో వంటలక్క వచ్చి తలుపు గొళ్లెంతీసి, "అదేమిటి బాబూ, మిమ్మల్ని లోపలపెట్టి తలుపు





వేసిందెవరు? అల్లరి సత్యం కాదుకథా?" అన్నది.

"నోరుముయ్యి!" అన్నాడు సత్యం కోపంతో.

ఎన్నడూ తనని పల్లెత్తు మాట అనని యజమాని నోరుముయ్యి మన్నందుకు వంటలక్క చాలా బాధపడింది. పైకి సూరయ్యలాగా కనిపించేది సత్యమేనని ఆవిడకేం తెలుసూ ?

సత్యనారాయణ చెంగుచెంగున మెట్లెక్కి పైకి వెళ్ళటానికని బయలుదేరాడు. తన తండ్రి డబ్బులెక్కడ పెడతాడో వాడికి తెలుసు. కాని సత్యానికి చెంగుచెంగున మెట్లెక్కడం సాధ్యం కాలేదు. ఒళ్ళంతా బరువెక్కినట్టుంది. కాళ్ళు మొద్దుబారి పోయాయి. రెండు మూడు మెట్లు ఎక్కి మెట్ల మీద బోర్లాపడ్డాడు. కణత బొప్పికట్టింది. మోకాటి మీద చర్మం కొట్టుకుపోయింది. ముక్కుతూ మూలుగుతూ మెట్లన్నీ ఎక్కేసరికి కాళ్ళు పీకసాగాయి. రొప్పు వచ్చింది.

"పోనీ ఆ గారెలూ, అవడలూ తినే బయటికి పోదాం. చాలా ఆయాసంగా ఉంది," అనుకున్నాడు సత్యం. వంటలక్కను కేకేసి ఫలహారం పట్టుకు రమ్మన్నాడు.

వంటలక్క పళ్లెంలో గారెలూ, ఆవడలూ పట్టుకొచ్చి, "ఇప్పుడే కద తిన్నారు? ఇవి పిల్లవాడి కోసం ఉంచాను. మీరు మళ్ళీ తింటారా? కడుపునొప్పి వొస్తుందేమో?" అన్నది.

"నాకు నువ్వు ఫలహారం పెట్టావా? కడుపులో నొప్పి అని అబద్ధం ఆడాను. నాకోసం ఉంచినవి నాకు పెట్టటాని కేడుస్తావేం? పెట్టక్కడ." అని సత్యం గదమాయించాడు.

వంటలక్క తన చెవులను తానే నమ్మలేకపోయింది. తన యజమానికి మతి చెడిందని అనుమానంవేసి, నౌకరును పంపి వైద్యుడిని రమ్మని కబురు చేసింది.

వైద్యుడు రావటం మేలే అయింది. ఎందుచేతనంటే అదరా బాదరా ఫలహారం తిని సత్యం పక్కమీద పడి పొర్లిగింతలు పెడుతున్నాడు, కడుపు నొప్పితో. వైద్యుడు కడుపునొప్పికి మందిచ్చి వెళ్ళి పోయాడు.

వైద్యుడు తనను "తమరు, తమరు" అని గౌరవంగా పిలవటం, అంత బాధలో కూడా సత్యానికి ఆశ్చర్యం కలిగించింది. వైద్యుడు వెళ్ళాక కొద్దిసేపటికి కడుపు నొప్పి కాస్త సర్దుకున్న తరవాత, సత్యం లేచి బల్లసొరుగులో తాళపుచెవులు తీసుకుని డబ్బు కోసం బీరువా దగ్గిరికి వెళ్ళి చూసి, కొట్టినట్టు తుళ్ళిపడ్డాడు. ఎందుచేతనంటే బీరువా అద్దంలో తన తండ్రి ప్రతిబింబం కనపడింది.



"చచ్చాన్రా, బాబూ," అనుకుని సత్యం వెనక్కు తిరిగి చూశాడు. తండ్రి జాడలేదు. మళ్ళీ అద్దంలోకి చూశాడు. అద్దంలో తండ్రి ఆకారం మళ్లీ కనిపించింది. బట్టతలా, మీసాలూ, కళ్ళజోడూ కనిపించాయి. తన మొహం తడువుకున్నాడు. తన మొహాన మీసాలూ, కళ్ళజోడూ తగిలాయి.

సత్యానికి తల తిరిగినట్టయిపోయింది. తను ఎట్లాగో తన తండ్రి అయిపోయాడు. ఈ సంగతి తెలియగానే మొదట దిగులు వేసింది. కాని వెంటనే సంతోషం కూడా కలిగింది. ఇక తను బడికి పోనక్కర్లేదు. దెబ్బలు తినక్కర్లేదు. ఏదిపడితే అది తినవచ్చు. ఎక్కడికి పడితే అక్కడికి పోవచ్చు. డబ్బు, ఇక డబ్బంతా తనదే! సంతోషంతో ఒక్కగంతు వెయ్యబోయి కుప్పలా కూలబడ్డాడు సత్యం.

ఇప్పుడు వాడికి మరో ఆలోచన కలిగింది. తను తన తండ్రిగా మారిపోతే తన తండ్రి ఏమయినట్టు ?

ఈ ప్రశ్నకు సమాధానమల్లే మెట్లమీద అడుగులచప్పుడు వినపడింది. ఎనిమిదేళ్ల బొట్టికాయి ఒకడు మెల్లగా మెట్లెక్క

వస్తున్నాడు. తీరా చూస్తే ఆ మెట్లెక్కి వస్తున్నది తనే.

తన తండ్రికి తన స్వరూపం వచ్చిందని సత్యం చప్పున గ్రహించాడు. ఇప్పుడు తండ్రికి మంచి పాఠం నేర్పుదామనుకున్నాడు. బీరువా తాళపుచెవులు జేబులో దాచేశాడు.

సూరయ్య పైకి వచ్చి తన ప్రతిబింబంలాగా నిలబడి ఉన్న కొడుకును చూసి నవ్వసాగాడు. సత్యంకు నవ్వు రాలేదు. భయంవేసింది.

"మనం ఇట్లా ఎందుకయినామో నీకేమైనా తెలుసునా?" అన్నాడు సూరయ్య.

సత్యం, "నాకు తెలీదు," అన్నాడు అమాయకంగా.

"పెద్ద చిక్కే వచ్చిపడింది. నువ్వే నేననీ నేనే నువ్వనీ మనం ప్రపంచాన్ని నమ్మించటం చాలా ఇబ్బంది అయ్యేటట్టున్నది. నేను బోలెడన్ని వ్యవహారాలు నడపాలి. డబ్బు వసూలుచేస్తూ ఉండాలి. నాకు చేతినిండా పనులున్నాయి. ఊరినిండా స్నేహితులున్నారు. ఈ పనులన్నీ ఈ అవతారంతో ఎట్లా చెయ్యను? అందరి దగ్గరికీ ఎట్లా వెళ్ళను? ఒకవేళ కష్టపడి నేను ఫలానా అని అందరికీ రుజువు చేసుకున్నా వాళ్ళు నన్ను మామూలుగా చూడరే. ఈ సమస్యను పరిష్కరించడం ఎలా?" అన్నాడు తండ్రి.

కొడుకు తలాడిస్తూ, "ఏమో నాకు తెలీదు," అన్నాడు.

"అన్నట్టు నీ చదువు మాటేమిటి?" అన్నాడు సూరయ్య.

"చదువా? ఈ శరీరంతో వెళ్ళి నన్ను బళ్ళో కూచోమన్నావా? బాగుంది," అన్నాడు సత్యం.

"ఎట్లా తగలడుతుందిరా మరి? నువు బళ్ళోకి వెళతావే, మానుతావే నాకు అనవసరం. చదువుకోకపోతే నీ ఖర్మాన నువే పోతావు. నా వ్యవహారాలు నేను చూసుకోక తప్పదు," అంటూ సూరయ్య దేనికోసమో బల్లసొరుగులో వెతకసాగాడు. —(ఇంకావుంది)





# సీసాలో భూతం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, అర్ధరాత్రివేళ, ఈ శ్మశానంలో ఎన్నో కఠిన శ్రమలకోర్చుతూ కూడా పట్టు వీడక, చేపట్టిన కార్యాన్ని సాధించాలనే పట్టుదలలో వున్న నిన్ను, అభినందించ వలసిందే. అయితే, కార్యం సఫలమైన తరుణంలో ఎంతో సమయస్ఫూర్తినీ, వివేకాన్నీ ప్రదర్శించకపోతే, పడిన శ్రమ అంతా వృథా కాగలదు. ఇందుకు ఉదాహరణగా, శ్రీముఖుడనే వాడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

ఒకానొక గ్రామంలో శ్రీముఖుడనే పేదవాడుండేవాడు. వాడు యువకుడు,

## బేతాళ కథలు



అందగాడు. ఎలాగైనా భాగ్యవంతుడు కావాలని వాడి కోరిక. అందుకోసం వాడు ఎన్నెన్నో ఊళ్ళు తిరిగి ఎందరో సాధువులను దర్శించాడు.

ఒకసారి సాధువొకడు, వాడిని పరీక్షగా చూసి, "నీ ఇంటినొక దుష్టగ్రహం పట్టి పీడిస్తున్నది. అందువల్లనే, నీవెంత కష్టపడినప్పటికీ ఫలితం దక్కడం లేదు. నేనొక తాయెత్తునిస్తాను. దాన్ని పెరట్లో పాతిపెట్టావంటే, నీ రోజులు బాగవుతాయి," అంటూ తాయెత్తునొకదాన్ని వాడికిచ్చాడు.

శ్రీముఖుడెంతో సంతోషించి, తాయెత్తును తీసుకుని ఇంటికి వెళ్ళి, గొయ్యి తవ్వడం ప్రారంభించాడు. కొద్ది లోతు తవ్వేసరికి, అక్కడ వాడికొక సీసా దొరికింది. ఆ సీసా ఎంతో అందంగా వున్నది. అందులో ఏదో ద్రవం కదులుతున్నది. శ్రీముఖుడు వెంటనే సీసా మూత తీశాడు.

అంతే! ఆ మరుక్షణం వాడి చుట్టూ ఏదో పొగలాటిది కమ్ముకున్నది. కొంతసేపటికి వాడికి కళ్ళు కనబడలేదు. తర్వాత పొగ మాయమై, వాడికి కళ్ళు కనబడేసరికి, సమీపంలో భయంకరాకారంలో వున్న భూతమొకటి నిలబడి వున్నది.

శ్రీముఖుడికి పై ప్రాణాలు పైనే పోయాయి. కానీ భూతం మాత్రం వాడికేసి ఎంతో ప్రేమగా చూస్తూ, "నీ కారణంగా నాకు బంధవిముక్తి అయింది. నీకు నా కృతజ్ఞతలు. నిన్ను చూస్తే పేదరికంతో బాధలు పడుతున్నట్టు కనబడుతున్నావు. ప్రత్యుపకారంగా నువ్వు భాగ్యవంతుడివయ్యే ఉపాయం చెబుతాను," అన్నది.

ఈ మాటలు వినగానే శ్రీముఖుడిలో భయంపోయి, ఉత్సాహం వచ్చింది. వాడు భూతం చెప్పింది శ్రద్ధగా విన్నాడు. ఆ ప్రకారం—భూతం అక్కడికి పది ఆమడల దూరంలో వున్న విష్ణుపురంలోని

రత్నగుప్తుడనే భాగ్యవంతుడి కూతుర్ని పట్టుకుంటుంది. శ్రీముఖుడు రాగానే వదిలి పెట్టేస్తుంది. ప్రతిఫలంగా రత్నగుప్తుడు, తన కూతుర్ని శ్రీముఖుడికిచ్చి పెళ్ళి చేస్తాడు.

భూతం ఈ వివరాలు చెప్పి, "నాకు జ్ఞాపకశక్తి తక్కువ కాబట్టి, నీ రూపం మరిచిపోయే అవకాశమున్నది. నీవు అక్కడికి రాగానే గుర్తుగా, సీసాలో భూతం, సీసాలో భూతం అని రెండుసార్లు చెప్పు. నాకు అంతా గుర్తుకొస్తుంది," అన్నది.

శ్రీముఖుడు బుద్ధిగా తలూపగానే, భూతం మాయమయింది.

ఆ తర్వాత అంతా భూతం చెప్పినట్టుగానే జరిగింది. రత్నగుప్తుడి కూతుర్ని వదిలిపెట్టేటప్పుడు భూతం శ్రీముఖుడితో, "నేను, నీకు ప్రత్యుపకారం చేశాను. మళ్ళీ నా జోలికి రావద్దు. వచ్చావో నిన్ను జీవితాంతం పట్టి పీడిస్తాను!" అన్నది.

శ్రీముఖుడు, రత్నగుప్తుడి కుమార్తె శ్రీవల్లిని వివాహం చేసుకుని, కొంతకాలం సుఖంగా జీవించాడు.

కొన్నాళ్ళకు వాడికి, ఆ దేశపు రాజకుమార్తెను భూతం పట్టుకున్నట్టు తెలిసింది. భూతాన్ని వదిలించిన వాడికి, తన కూతుర్నిచ్చి పెళ్ళి చేస్తానని రాజు



ప్రకటన కూడా చేశాడు. ఎలాగైనా రాజకుమార్తెను పట్టిన భూతాన్ని వదిలిస్తే, తను రాజకుమార్తెను పెండ్లాడి రాజ్యాన్నే ఏలవచ్చునని, శ్రీముఖుడికి ఆశ పుట్టింది. అయితే, రాజకుమార్తెను పట్టింది సీసాలో భూతమేనని వాడి అనుమానం! మళ్ళీ రావద్దని హెచ్చరించిన ఆ భూతం దగ్గరకు మరొకసారి వెళితే, ఏమవుతుందో అని వాడి భయం!

శ్రీముఖుడిలా సందిగ్ధావస్థలో వుండగా, వాళ్ళింటికొక సాధువు వచ్చాడు. ఆయన శ్రీముఖుణ్ణి కలుసుకుని, "నాయనా, నువ్వు రత్నగుప్తుడి కుమార్తెను భూతం బారి నుంచి రక్షించావు. అదే భూతం, ఈ



దేశపు రాజు కూతుర్ని పట్టి పీడిస్తున్నది. నేను రాజకుమార్తె బాధ చూడలేక పోయాను. నావద్ద భూతాలను వశపరుచుకునే మంత్రాలున్నవి. అయితే, తెలిసిన భూతాల మీదనే, ఆ మంత్రాలు పని చేస్తాయి. ఈ భూతాన్ని గుర్తించడానికి నువ్వేదైనా మార్గం సూచించగలిగితే, నాకు ప్రయోజనకరంగా వుంటుంది,'' అన్నాడు.

సాధువు మాటలు విని, శ్రీముఖుడు కాసేపాలోచించి, ''స్వామీ, తమరు సర్వసంగ పరిత్యాగం చేసిన సాధువులు. రాజకుమార్తెకు భూతాన్ని వదిలించడంవల్ల, మీకేం ప్రయోజనం? నేనైతే యీ దేశానికి రాజును కావాలని కలలు కంటున్నాను. ఆ భూతాన్ని వదిలించే అవకాశం, నాకే యివ్వండి,'' అన్నాడు.

సాధువు నవ్వి, ''ఆ పని చేయాలంటే నువ్వు, భూతం కంటే ఉత్తముడివై వుండాలి. అలా కానప్పుడు బెడిసికొట్టి, భూతమే నిన్ను వశపరుచుకోగలదు,'' అన్నాడు.

శ్రీముఖుడు భయపడకుండా, "స్వామీ, మనిషి భూతం కంటే ఉత్తముడు కాక పోడు. నాకు మంత్రోపదేశం చెయ్యండి,'' అని కోరాడు.

సాధువు సరేనని భూతం గురించిన వివరాలడిగాడు. తను రత్నగుప్తుడి కుమార్తెకు వదిలించిన భూతాన్ని, సీసాలో భూతం అనాలని శ్రీముఖుడు, సాధువుకు చెప్పాడు.

సాధువు, శ్రీముఖుడికి మంత్రోపదేశం చేసి, ''ఈ మంత్రం చదివి, నువ్వు సీసానొకదాన్ని రాజకుమార్తె ముందు పెట్టి, ''సీసాలో భూతమా! సీసాలోకి పో,'' అన్నావంటే, భూతం ఆమెను వదిలి, సీసాలో ప్రవేశిస్తుంది. అప్పుడు సీసాకు మూత బిగించి భూస్థాపితం చేసెయ్యి,'' అని చెప్పాడు.

శ్రీముఖుడు చాలా సంతోషించి, ఒక సీసా తీసుకుని రాజకుమార్తెను చూడ

బోయాడు. వాడు రత్నగుప్తుడి కూతురికి భూతాన్ని వదిలించినవాడని తెలిసి, రాజుకు వాడి మీద చాలా నమ్మకం కలిగింది. రాజమందిరంలో శ్రీముఖుడికి చాలా గౌరవంతో సకల సత్కారాలూ జరిగాయి.



ఒక సుముహూర్తాన శ్రీముఖుడు, రాజకుమార్తె ముందు సీసాను పెట్టి, సాధువు చెప్పిన విధంగా మంత్రోచ్చారణ చేసి, "సీసాలో భూతమా! సీసాలోకి పో," అన్నాడు.

అంతే! ఆ వెనువెంటనే రాజకుమార్తె పెద్దగా కేకపెట్టి, మంచం మీది నుంచి లేచి నేల మీద విరుచుకు పడిపోయింది. మరుక్షణం శ్రీముఖుడు వెకిలిగా నవ్వుతూ, దయ్యం పట్టినవాడిలా పిచ్చిగంతులు వేయసాగాడు.

రాజకుమార్తెను వదిలి, భూతం శ్రీముఖుణ్ణి పట్టుకున్నదని, అక్కడున్న వారందరూ గుర్తించడానికి ఎంతోసేపు పట్టలేదు. ఆ సమయంలో సాధువు అక్కడికి వచ్చి, శ్రీముఖుడి కేసి చూస్తూ ఏదో మంత్రోచ్చారణ చేసి, "సీసాలో భూతమా, సీసాలోకి పో!" అన్నాడు గంభీర స్వరంతో.

ఆ వెంటనే శ్రీముఖుడు పెద్దగా కేక పెట్టి, వెనక్కు విరుచుకుపడిపోయాడు. వాడి శరీరం మీది నుంచి ఏదో పొగలా వచ్చి, సీసాలోకి పోయింది. సాధువు సీసాకు గట్టిగా మూత బిగించి, ఎవరికీ తెలియనిచోట దాన్ని భూస్థాపితం చేయించాడు.

రాజకుమార్తే, శ్రీముఖుడూ కొద్దిసేపటికి మామూలు మనుషులయ్యారు. అన్న మాట ప్రకారం రాజు తన కుమార్తెను, శ్రీముఖుడికిచ్చి పెళ్ళి చేస్తానన్నాడు. శ్రీముఖుడు అందుకు అంగీకరించక, "రాజకుమార్తెకు భూతాన్ని వదిలించిన ఘనత, నాదికాదు, సాధువుది. మన మంతా ఆయన ఎలా చెబితే అలా చేయాలి," అన్నాడు.

రాజు, సాధువు నడిగితే ఆయన, "శ్రీముఖుడే రాజకుమార్తెకు తగిన వరుడు!" అన్నాడు.

శ్రీముఖుడిందుకు ఆశ్చర్యపడి, సాధువుతో, "స్వామీ, మనిషినైన నేను భూతానికన్న అధముణ్ణి!" అని, అక్కడి నుంచి వెళ్ళిపోయాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, శ్రీముఖుడలా అనడం బుద్ధిమాలినతనం అనిపించుకోదా? రాజు తన కుమార్తెను, అతడి కివ్వడానికి అంగీకరించాడు. సాధువు కూడా, రాజకుమార్తెను వివాహమాడేందుకు శ్రీముఖుడే అర్హుడన్నాడు. అయినా శ్రీముఖుడు తాను భూతంకన్న అధముణ్ణని ఎందుకన్నాడు? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "బాగా ఆలోచించి చూస్తే, శ్రీముఖుడలా ఎందుకన్నాడో అర్థమవుతుంది. ఇతరులు చేసిన సాయాన్ని మరిచి, కృతఘ్నుడుగా ప్రవర్తించే ప్రతిమనిషీ భూతప్రేతాలకన్న అధముడే! శ్రీముఖుడు భూతమున్నదని తెలియక సీసామూత తీస్తే, భూతానికి స్వేచ్ఛలభించింది. కావాలని చేయకపోయినా, వాడి సాయానికి భూతం సంతోషించి, పేదరికంలో మగ్గే అతణ్ణి భాగ్యవంతుణ్ణి చేసింది. అలాంటి ప్రత్యుపకారం చేసిన భూతాన్ని, రాజకుమార్తెను పెళ్ళాడి, ఒక రాజ్యానికి రాజు కావాలనే స్వార్థం కొద్దీ శ్రీముఖుడు తిరిగి సీసాలో బంధించాలని చూశాడు. వాడి మంత్రోచ్చారణకు భూతం వశం కాకపోగా, వాణ్ణే వశం చేసుకున్నది. అంటే—భూతంకన్న వాడు అధముడని తేలిపోయింది. ఈ ధర్మసూక్ష్మాన్ని గుర్తించడంవల్లనే, శ్రీముఖుడు రాజకుమార్తెను వివాహమాడకుండా అక్కడినుంచి వెళ్లిపోయాడు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)





# చెల్లని నాణెం

చక్రధరపురం రాజు చంద్రశేఖరుడు, ఒకసారి మంత్రీ, సేనాపతులతోపాటు అరణ్యానికి వేటకు వెళ్ళాడు. మిట్ట మధ్యాహ్నం వరకూ ఆయన అరణ్య మృగాలను వేటాడి తిరిగి వచ్చేసరికి, ఒక సెలయేటి దాపుల్లో నౌకర్లు గుడారాలు వేసి, భోజనం సిద్ధంచేశారు.

రాజూ, ఇతర ముఖ్యులూ భోజనాలు ముగించి, ఆనాటి వేట విశేషాలను గురించి మాట్లాడుకుంటూండగా, ఒక పేద తీర్థయాత్రికుడు రాజు దగ్గిరకొచ్చి, ఏదైనా ధర్మం చెయ్యమని అడిగాడు.

రాజు, ఒకవరహా వాడికిచ్చి, తిరిగి మంత్రి, సేనాపతులతో సంభాషించసాగాడు. యాత్రికుడు, రాజు దగ్గిరికి తిరిగి వచ్చి, "ప్రభూ, తమరు చెల్లని నాణెం యిచ్చారు. దయచేసి దీన్ని తీసుకుని మరొకటి యిప్పించండి," అన్నాడు.

బిచ్చగాడు అలా అడిగేసరికి, రాజుకు పట్టరాని కోపం వచ్చి, "నా దగ్గిర మరొకటి లేదు. ఇచ్చిందేదో తీసుకుని పో," అన్నాడు.

"అలా అయితే తమరిచ్చింది, తమరే తీసుకోండి!" అన్నాడు యాత్రికుడు.

రాజు ఉగ్రుడైపోయి, "నీ కెంతపొగరు! నే నిచ్చింది తిరిగి నేను తీసుకోవడమేమిటి? పో యిక్కణ్ణించి," అన్నాడు.

యాత్రికుడు ఎంతో వినయంగా, "ప్రభూ, నన్ను క్షమించండి! ఈ నాణేన్ని తిరిగి తీసుకోవడం ద్వారా, తమరు నాకెంతో మేలు చేసినవారవుతారు. దయచేసి కాదనకండి," అని, ఆ నాణేన్ని రాజు పాదాల దగ్గిర వుంచి, వెళ్ళిపోయాడు.

వాడి విచిత్ర ప్రవర్తన మంత్రీ, సేనాపతులతో పాటు, రాజుకూ ఎంతో ఆశ్చర్యాన్ని కలిగించింది. ఆయన వెంటనే

దాసరి వెంకటరమణ

తన నౌకర్లను పంపి, వెళ్ళిపోతున్న యాత్రికుణ్ణి పిలిపించాడు.

"నేను రాజును. నువ్వు, నా రాజ్య పౌరుడివేగదా! ఒకవేళ అది చెల్లని నాణెమే అయినా, నామీది గౌరవంకొద్దీ, నీ వద్దనే వుంచుకోవచ్చుగదా? నేను, దాన్ని తిరిగి తీసుకోవడంద్వారా, నీకు ఎలా మేలు చేసినవాణ్ణవుతాను?" అని రాజు యాత్రికుణ్ణి ప్రశ్నించాడు.

అందుకు యాత్రికుడు, "ప్రభూ, యీ చెల్లని నాణెం మన రాజ్యపు టంకశాలలో ముద్రించినదే గదా?" అని అడిగాడు.

ఆ ప్రశ్నకు రాజు ఆశ్చర్యపోతున్నంతలో మంత్రి కల్పించుకుని, "అవును. అయినా, నీ కెందుకు అలాంటి సందేహం కలిగింది?" అని అడిగాడు.

"ఆ టంకశాలలో అసమర్థులో, నిజాయితీ కొరవడినవాళ్ళో వున్నారని, నా అనుమానం," అన్నాడు యాత్రికుడు.

వాడి మాటలకు సేనాని విసుక్కుంటూ, "వాళ్ళ సంగతి మేము చూసుకుంటాం. ముందు మహారాజుగా రడిగిన దానికి జవాబు చెప్పు," అన్నాడు.

అప్పుడు యాత్రికుడు వినయంగా, "ఆ నాణెం ఎక్కడా చెల్లదు. నేను చూస్తూ చూస్తూ దాన్ని ఎక్కడా పారెయ్యలేను. అలా అని నా వద్ద వుంచుకోనూ లేను. ఎందుకంటే, దాన్ని చూసినప్పుడల్లా—రాజుగారు నాకు మంచి నాణెం యిచ్చి వుంటే ఎంత బావుండేది అనుకుంటూ, నాలో నేను మనోవ్యథ చెందుతాను. అలా కాక, ఆ నాణెం తమరే తీసుకుంటే, అసలు రాజుగారు నా కే నాణెం యివ్వ లేదనుకుని, ఆ విషయమే పూర్తిగా మరిచిపోతాను," అన్నాడు.

మంత్రి, యాత్రికుణ్ణి మెచ్చుకుంటూ, "మహారాజా, విన్నారుగదా, అతను ఆ చెల్లనినాణేన్ని తమ పాదాల వద్ద వుంచిపోవటంలోని అంతర్యం!" అన్నాడు.

రాజు నవ్వి, యాత్రికుడికి తృప్తిగా భోజనం పెట్టించి, తన మెడలోని రత్నాల హారాన్ని అతడికి బహూకరించాడు.



# చందమామ అనుబంధం—7

# మన విజ్ఞాన సంపద

## మహనీయులు:



### మహారాణా ప్రతాప్

మేవార్‌ను పరిపాలించిన మహారాణా ఉదయసింగ్ కుమారుడైన రాజపుత్ర వీరుడు రాణాప్రతాప్ 1540 వ సం॥ మే 9 న జన్మించాడు. ప్రతాప్ మేవార్ మహారాణా అయిన సమయంలోనే అక్బర్‌చక్రవర్తి తన రాజ్య విస్తరణకు పూనుకున్నాడు. ఆయన్ను రాజపుత్ర వీరులు తీవ్రంగా ఎదుర్కొన్నారు. రాజకీయ తంత్రం ద్వారా, యుద్ధం ద్వారా ఒక్కొక్కరిగా అక్బర్ వశపరచుకో సాగాడు. ఒక్క మహారాణా ప్రతాప్ మాత్రమే ఆయన్ను ఏలికగా అంగీకరించడానికి నిరాకరించాడు।

1576 వ సంవత్సరం ఏప్రిల్ 1 వ తేదీ హల్దీఘట్‌లో మాన్‌సింగ్ నాయకత్వం వహించిన మొగల్ సేనలకూ, మహారాణా ప్రతాప్ సేనలకూ మధ్య ఘోరయుద్ధం జరిగింది. మహారాణా అపురూపమైన ధైర్యసాహసాలతో పోరాడుతూ విజయోన్ముఖుడవుతూన్న సమయంలో మొగలుల పక్షానికి కొత్తసేనలు వచ్చి చేరాయి. ప్రతాప్ గుర్రం చేతక్ గాయపడి తన నాయకుణ్ణి సురక్షితస్థలానికి తీసుకెళ్ళింది.

ఈ యుద్ధానంతరం కూడా మహారాణా మొగలుల అధికారానికి తల ఒగ్గలేదు. కొత్తగా ఒక కోటను నిర్మించి, మొగలులవశమైన ప్రాంతాలను క్రమంగా రాబట్టుకోసాగాడు. ఆయన 1597 వ సంవత్సరం మరణించాడు. అయినా, భారతదేశంలో పుట్టిన వీర కుమారులలో అగ్రగణ్యుడుగా మన హృదయ్యాలలో ఈనాటికీ చిరస్థాయిగా వెలుగొందుతున్నాడు।

## ఎవరాయన?

దక్షిణ భారతదేశంలోని ఒక గొప్ప ఆలయాన్ని, ఢిల్లీ సుల్తాను దోచుకున్నాడు. సుల్తాను సైనికులు దేవాలయంలోని విలువైన ఆభరణాలతోపాటు, గుడిలోని ప్రధాన ఉత్సవ విగ్రహాన్ని కూడా ఢిల్లీకి తరలించుకు వెళ్ళారు.

కొన్నాళ్ళ తరవాత, దక్షిణాది నుంచి ఒక మహనీయుడు ఢిల్లీ వెళ్ళి, సుల్తానును కలుసుకుని, ఆలయం నుంచి తరలించుకుని వచ్చిన విగ్రహాన్ని తిరిగి ఇవ్వమని కోరాడు. సుల్తాను అందుకు అంగీకరించాడు. ఆ విగ్రహం అంతవరకు సుల్తాను కుమార్తె అధీనంలో వున్నది.

విగ్రహాన్ని తీసుకుని ఆయన దక్షిణదేశానికి తిరుగుప్రయాణమయాడు. ఆయన పయనిస్తూన్న బండికి వెనకగా, ముసుగు వేసుకున్న ఒక స్త్రీ రాసాగింది. కొన్నాళ్ళకు వాళ్ళు ఆలయపట్టణానికి చేరుకున్నారు. బండి వెనకగా ఇంతదూరం నడిచి వచ్చిన స్త్రీ ఎవరోకాదు, సుల్తాను కుమార్తే అని తెలిసింది. ఆ విగ్రహం పట్ల ఆమె ఎంతో బంధం పెంచుకున్నది. దానిని వదిలి ఉండలేక ఢిల్లీ వదిలి ఇక్కడికి వచ్చింది. ఆమె భక్తికి ముగ్ధుడయిన ఆ మహనీయుడు, ఆమెను ఆలయంలో ప్రవేశించడానికి అనుమతించాడు. కొన్నాళ్ళకు ఆమె అక్కడే పరమపదించింది. ఆమె గౌరవార్థం ఆ దేవాలయంలో కొన్ని ముస్లిం సంప్రదాయ పద్ధతులు ప్రవేశపెట్టారు.

అలా చేసిన మహనీయుడు ఎవరో మీకు తెలుసా? (VIII పేజీ చూడండి)



# నీటివంపు

సూచనలు :

నీళ్ళకొళాయి నుంచి సన్నటి జలధార కిందికి పడే విధంగా అమర్చండి. తరవాత, గాలి నింపిన ఒక బెలూన్‌ను, పొడిగా వున్న ఊలుగుడ్డతో బాగా రుద్ది, దానిని జలధారకు కొన్ని అంగుళాల దూరంలో పట్టుకుని ఏం జరుగుతుందో చూడండి.

ఏం జరుగుతుంది ? ఎలా జరుగుతుంది ?

తిన్నగాపడే జలధారలో చిన్న వంపు కనిపిస్తుంది. జలధార కొళాయి నుంచి తిన్నగా కిందికి జారడానికి భిన్నంగా, బెలూన్ కేసి పక్కపక్కలకు వంగి ఆ తర్వాతనే కిందికి తిన్నగా పడుతుంది.

బెలూన్ వెలుపలి భాగంలో కొద్దిపాటి విద్యుత్ చార్జ్ అవుతుంది. అది నీళ్ళను అటుకేసి ఆకర్షిస్తుంది. ఈ విద్యుత్తును స్థిరవిద్యుత్తు (స్టాటిక్ ఎలక్ట్రిసిటీ) అని అంటారు. పొడి ఊలుతో రబ్బరు బెలూన్ వెలుపల రుద్దడంవల్ల ఏర్పడే అసంఖ్యాకమైన ఎలక్ట్రానుల ఫలితంగా ఈ విద్యుత్తు ఉత్పన్నమవుతుంది. ఎక్కువయ్యే ఎలక్ట్రానులు గాలిలోకి పోతాయి. అప్పుడు కొంత ఆకర్షణశక్తి పుడుతుంది.

బెలూన్ నీళ్ళకు మరింత దగ్గరగా ఉన్నట్టయితే, నీటిధార బెలూన్‌చుట్టూ తిరిగి చెదురుతుంది. అలా జరగదా ? తడిసిన బెలూన్ నీళ్ళను ఇంకా పక్కలకు నెడుతుందా ?

'చార్జ్' చేయబడిన బెలూన్‌తో చిన్న చిన్న కాగితం ముక్కలు వంటి వాటిని ఆకర్షించడం వీలవుతుందా ? ప్రయత్నించి చూడండి.

# అలెగ్జాండ్రియా లైట్ హౌస్

ఫారోస్ ద్వీపంలో అలెగ్జాండ్రియా నగర సమీపాన టోలమీ ఫిలాడెఫస్ నిర్మించిన బ్రహ్మాండమైన దీపస్తంభం ఉండేది. ఇది క్రీ. పూ. 3 వ శతాబ్దంలో నిర్మించబడింది. తెల్లటి పాలరాతితో అనేక అంతస్తులుగా నిర్మించబడిన ఈ కాంతిగృహం పై అంతస్తులు కింది వాటికన్నా చిన్నవి. 520 అడుగుల ఎత్తు కలిగిన ఈ దీపస్తంభం మీది మంట వెలుగు సముద్రంలో 30 మైళ్ళ దూరం కనిపించేది. భూకంపాలూ, సముద్రపు అటుపోట్లూ ఈ వెలుగు మందిరాన్ని క్రమక్రమంగా హరించేశాయి. అయినా 13 వ శతాబ్దం వరకు దీని శిథిలావశేషాలు ఉన్నట్టు దాఖలాలు ఉన్నాయి!



గొప్ప చారిత్రక ఘట్టాలు

# ఆలోచనకు

అభ్యుదయవాదులకూ, సంప్రదాయవాదులకూ మధ్య, అతి ప్రాచీనకాలం నుంచే ఘర్షణ జరుగుతున్నది. స్వతంత్రంగా ఆలోచించడం, ఆలోచించిన విషయాలను నిర్భయంగా వెలిబుచ్చడం, ఈ రెండూ మానవ పురోగతికి సోపానాలు వంటివి. అయినా, ఈ సత్యాన్ని సంప్రదాయవాదులు అర్థం చేసుకోరు!



స్వతంత్రంగా ఆలోచించమనీ, ఎటువంటి మూఢనమ్మకాలకూ, అధికారాలకూ లోనుకాకుండా స్వయం నిర్ణయాలు తీసుకోమనీ, క్రీ. పూ. 6వ శతాబ్దంలో ఏథెన్స్‌నగర యువకులను ప్రబోధించిన తత్వవేత్త సోక్రటీసును సంప్రదాయవాదులు సహించలేక పోయారు. యువకులందరూ ఆ తత్వవేత్తను మహాజ్ఞానిగా గౌరవించారు. కాని సంప్రదాయవాదులు అతన్ని అత్రగాడనీ, దగాకోరనీ ఈసడిం

# మేలుకొలుపు



చారు. అంతేకాదు; యువతను పెడమార్గం పట్టిస్తున్నాడని ఆయన మీద బహిరంగంగా నేరారోపణ చేశారు. ఐదువందలా ఒకరు గల న్యాయ సదస్సు విచారణ జరిపింది. అభియోగాలకన్నిటికీ సమాధానం ఇస్తూ, తన మీది నేరారోపణ ఎంతటి అబద్ధమైనదీ, అర్థరహితమైనదీ, అన్న విషయాలను అపూర్వమైన వాక్పటిమతో తేటతెల్లం చేశాడు సోక్రటీసు. అయినా అధిక సంఖ్యాకులయిన న్యాయనిర్ణేతలు అతడు దోషి అని తీర్పు నిచ్చారు. అతనికి మరణశిక్ష విధించారు. 'హెమ్లక్' అనే విషం తాగి చావాలని శాసించారు!

సోక్రటీసు శిష్యులూ, అభిమానులూ విషాద వదనాలతో, కన్నీళ్లతో ఆయన చుట్టూ చేరారు. అయినప్పటికీ సోక్రటీసు హాయిగా నవ్వుతూ, విచారించవద్దని వారికి హితవు చెప్పాడు: "మరణం అన్నది ఏదీ లేనటువంటి ఒకస్థితి; లేదా అది ఒక లోకం నుంచి మరొక లోకానికి ఆత్మచేసే పయనం. నేను సెలవు తీసుకోవలసిన సమయం ఆసన్నమయింది. ఇక మనం మన దారులంట వెళ్ళాలి. నేను మరణిస్తున్నాను; మీరు జీవిస్తున్నారు. ఏది ఉత్తమమో ఆ దేవుడికే ఎరుక."

చిరుదరహాసంతో అందరికీ శుభాకాంక్షలు తెలియజేస్తూ, 'హెమ్లక్' ఆఖరిచుక్కను ఆనందంతో ఆస్వాదించి స్పృహతప్పి పడిపోయాడు సోక్రటీసు. అలా, అల్పబుద్ధులయిన సంప్రదాయవాదులు— మనిషిని స్వబుద్ధితో ఆలోచించమని ప్రబోధించిన మహాజ్ఞాని అయిన ఆ తత్వవేత్త జీవితాన్ని అంత మొందించడంలో విజయం సాధించారు!

## గత చరిత్రకేసి చూద్దాం



1. మన దేశంలో ఒక రాష్ట్ర ప్రధానమంత్రి, స్వయంగా సేకరించిన వస్తువులతో వస్తుప్రదర్శనశాలను రూపొందించాడు. అది ఈనాడు మన జాతీయ వస్తుప్రదర్శనశాలలలో ముఖ్యమైనదిగా పేరు గాంచినది. ఆ మంత్రి ఎవరు?
2. మన దేశంలో దురాక్రమణదారులచేత ఆరుసార్లు నాశనం కాబడిన దేవాలయం ఏది?
3. ఆ దేవాలయ ప్రాంతం ఎందువల్ల పవిత్రంగా భావించబడుతున్నది?
4. నూటడెబ్భై సంవత్సరాల క్రితమే కనుగొనబడిన రెండు గుహాలయాలు ప్రపంచ ప్రసిద్ధి గాంచాయి. అవి ఏవి?
5. ఒక యువరాజు తొలుత అతి భయంకరుడుగానూ, ఆ తరవాత 'భక్తుడు'గానూ కీర్తిగాంచాడు. ఎవరాయన?
6. బౌద్ధమత వ్యాప్తికి దోహదం చేసిన యుద్ధం ఏది?
7. భారతదేశపు 'సింహద్వారం' అనబడే కట్టడం ఎక్కడ ఉన్నది?
8. అది ఎప్పుడు ఎందుకు నిర్మించబడింది?

(VIII పేజీ చూడండి)

## మన లోకజ్ఞానం పరీక్షించుకుందాం

1. దక్షిణధ్రువం కన్నా ఉత్తరధ్రువం ఎంత దిగువగా ఉన్నది?
2. చదవడానికి సరిపడేంత వెలుగు నివ్వడానికి ఎన్ని మిణుగురులు కావాలి?
3. సూర్యుడి చుట్టూ ఎన్ని తోకచుక్కలు పరిభ్రమిస్తున్నవి?
4. నాలుగు కళ్ళుగల చేప ఎక్కడ ఉన్నది?
5. 'షెర్లాక్ హోమ్స్'ను సృష్టించిన సర్ ఆర్థర్ కానన్ డాయిల్ వృత్తి రీత్యా ఏం చేసేవాడు?
6. పాములు ఎలా వాసన చూస్తాయి?
7. ఒకనాటి రాజు జన్మగృహాన్ని అలంకరించిన సుప్రసిద్ధ చిత్రపటం ఏది?
8. కప్ప తలను తిప్పగలదా?
9. మిడతల రక్తం ఏ రంగులో వుంటుంది?
10. ప్రపంచంలో కెల్లా అతి ప్రాచీనమైన విగ్రహం ఏది?

(VIII పేజీ చూడండి)




1. హిమాలయాలను పర్వతరాజంగానూ, దివ్యాత్మస్వరూపంగానూ అభివర్ణించిన కవి ఎవరు ?
2. చంద్రగుప్త మౌర్యుడి కథను తెలియజేసే నాటకం ఏది ?
3. హర్షవర్ధనుడి కథ తెలియజేసే గ్రంథం ఏది ?
4. ఆంగ్లేయుల నుంచి 'సర్' బిరుదు స్వీకరించి, ఆ పైన వదులుకున్న భారతీయ కవి ఎవరు ?
5. కుడివైపు నుంచి ఎడమవైపుకు రాయబడే భారతీయభాష ఏది ?
6. ఆ భాష ఎలా రూపొందింది ?
7. ఆ భాషను ఏ లిపితో రాస్తారు ?
8. తులసీదాసు రామాయణం అసలు పేరేమిటి ?
9. తులసీదాసు ఎప్పుడు ఎక్కడ నివసించాడు ?

(VIII పేజీ చూడండి)

## భారతీయ భాషలన్నిటిలోనూ ఒక మాట నేర్చుకుందాం

### ఈ నెల మాట: ఉత్తరము

| | | | | | |
|---|---|---|---|---|---|
| అస్సామీ | : ఉత్తర్ | బెంగాలీ | : ఉత్తర్ | ఇంగ్లీష్ | : నార్త్ |
| గుజరాతీ | : ఉత్తర్ | హింది | : ఉత్తర్ | కన్నడం | : బడగు |
| కాశ్మీరీ | : షుమాల్ | మలయాళం | : వడక్కు | మరాఠీ | : ఉత్తర్ |
| ఒరియా | : ఉత్తర్ | పంజాబీ | : ఉతర్ | సంస్కృతం | : ఉదీచి |
| సింధి | : ఉత్తరు | తమిళం | : వడక్కు | ఉర్దు | : షుమాల్ |

## మీరు నమ్ముతారా?

* పురాణకాలంనాటి భరతవర్షమూ, ఈనాటి భారతదేశమూ వైశాల్యంలో ఒకటేనా?
* ఎర్రగుడ్డను చూడగానే ఎడ్లు బెదురుతాయా?
* పక్షులన్నీ గూళ్ళు కట్టుకుంటాయా?

కానే కాదు!

* అనాటిది వైశాల్యంలో చాలా పెద్దది.
* ఎడ్లకు రంగులు కనిపించవు.
* మామూలుగా గుడ్లగూబలూ, చిలుకలూ చెట్టు తొర్రలలోనూ, శిథిలాలలోనూ నివసిస్తాయి.

# సమాధానాలు

### ఎవరాయన?

రామానుజాచార్యులు; ఆలయం శ్రీరంగం.

### చరిత్ర

1. హైదరాబాదు నిజాం ప్రధానమంత్రి మొదటి సర్ సాలార్‌జంగ్
2. సోమనాథ ఆలయం.
3 శ్రీకృష్ణుడు భౌతికకాయం త్యజించిన ప్రభాసతీర్థం సమీపంలో ఉండడంవల్ల.
4. అజంతా, ఎల్లోరా గుహలు.
5. అశోకచక్రవర్తి
6. కళింగయుద్ధం. ఆ యుద్ధానంతరం అశోకుడి మనసు మారి, బౌద్ధమతం స్వీకరించి, దాని వ్యాప్తికి కృషి చేశాడు.
7. బొంబాయిలోని అపోలోబందర్‌లో.
8. 1911 వ సం॥. జార్జ్ ప్రభువు, మేరీరాణులకు స్వాగతం చెప్పడానికి.

### లోకజ్ఞానం

1. 2799 మీటర్లు.
2. పన్నెండు చాలు.
3. పదికోట్లకన్నా ఎక్కువ.
4. మధ్య అమెరికాలో.
5. వైద్యుడు.
6. వాటి నాలుకతో.
7. మోనాలిసా. ఫ్రాన్స్ రాజు మొదటి ఫ్రాన్సిస్ దానిని తన జన్మగృహంలో అలంకరించాడు.
8. తిప్పదు. ఎందుకంటే దానికి మెడ లేదు.
9 తెలుపు.
10. స్ఫింక్స్.

### సాహిత్యం

1. కాళిదాసు
2. విశాఖదత్తుడి ముద్రారాక్షసం.
3. బాణభట్టుడి హర్షచరితం.
4. రవీంద్రనాథటాగూర్.
5. ఉర్దూ.
6. పర్షియన్, హిందీ భాషల కలయికతో. టర్కీ ప్రభావం కూడా ఉన్నది.
7. పర్షియన్.
8. రామచరిత్ మానస
9. కాశీలో. క్రీ. శ. 1532–1623 మధ్య కాలంలో.




# నెహ్రూ కథ–5

1920వ సంవత్సరంలో జవహర్‌లాల్ తల్లికీ, భార్యకూ సుస్తీ చేసింది. వాళ్లను ఆయన ముస్సూరీకి తీసుకువెళ్ళాడు. వాళ్ళు బసచేసిన హొటల్లోనే కొందరు ఆఫ్ఘనులు కూడా వున్నారు. ఆఫ్ఘనులు బ్రిటిష్‌వారికి వ్యతిరేకులు గనక, వారితో మాట్లాడనని హామీ ఇవ్వమని జవహర్‌లాల్‌ను ఒక బ్రిటిష్ న్యాయమూర్తి అడిగాడు.

తనకు ఆఫ్ఘనులతో మాట్లాడే ఉద్దేశం లేదు. అయినా, బ్రిటిష్‌వారికి అలా హామీ ఇవ్వడానికి జవహర్‌లాల్ నిరాకరించాడు. ఫలితంగా అతణ్ణి డెహరాడూన్ జిల్లా వదిలిపెట్టమని ఆజ్ఞాపించారు. జవహర్‌లాల్ తల్లినీ, భార్యనూ అక్కడే వదిలి అలహాబాదుకు చేరాడు. అక్కడ ఆయన ఒకనాడు రైతుల ఊరేగింపును చూశాడు.





పర్తాప్‌ఘర్‌జిల్లా గ్రామాల నుంచి, అ రైతులు తమ బాధలనూ, కష్టాలనూ నగర ప్రజలకు తెలియజేయడానికి వచ్చారు. జవహర్‌లాల్‌ను చూడగానే వాళ్ళు తమ బాధలను ప్రత్యక్షంగా చూడడానికి గ్రామప్రాంతాలకు రమ్మని ఆయన్ను పట్టుబట్టారు.

జవహర్‌లాల్ మొట్టమొదటిసారిగా మారుమూల గ్రామప్రాంతాలు పర్యటించి, దోపిడీకి గుర్తై పేదరికంతో అష్టకష్టాలుపడుతున్న రైతుల కన్నీటి బతుకులను కళ్ళారా చూశాడు. ఆ రైతుల శ్రమఫలితాన్నంతటినీ చిన్న చిన్న భూస్వాములు దోచుకునేవారు!





1921 జనవరిలో రేబరేలి రైతు నాయకులు ఖైదు చేయబడ్డారు. వాళ్ళను కాపాడడానికి వేలకొలది రైతులు ముందుకు వచ్చారు. జవహర్‌లాల్ కూడా ఖైదు జరిగే స్థలానికి బయలు దేరాడు. అయితే పట్టణానికి వెళ్ళే వంతెన వద్ద ఆయన్ను పోలీసులు ఆపి వేశారు.

జవహర్‌లాల్‌ను అక్కడికి వెళ్ళడానికి అనుమతించి వున్నట్టయితే, ఆయన రైతులతో మంచిగా మాట్లాడి వాళ్ళను శాంతియుతంగా అక్కడి నుంచి వెళ్ళేట్టుచేసి వుండేవాడు. అయితే, ఆయన్ను ఆపడంతో జనం మరింత రెచ్చిపోయి తిరగబడ్డారు. పోలీసు కాల్పులు జరిగాయి. చాలామంది మరణించారు!



వెంటనే రైతు కూలీలు ఒక భూస్వామి ఇంటిని కొల్లగొట్టారు. ఆ భూస్వామి శత్రువులు కొందరు, భూస్వామి ఇల్లు కొల్లగొట్టమని గాంధీజీ ఆదేశించినట్లు కూలీలకు చెప్పారు. అమాయకులైన రైతుకూలీలు ఆ మాటను నమ్మి "మహాత్మగాంధీకి జై" అని కేకలు వేస్తూ ఆ భూస్వామి ఇంటిని కొల్లగొట్టారు.





ఆ సంగతి జవహర్‌లాల్‌కు తెలిసి ఎంతో బాధపడ్డాడు. అతనికి కోపం వచ్చింది. ఇటువంటి సంఘటనలు కాంగ్రెస్ ప్రతిష్ఠకు భంగం కలిగించ గలవని భావించి, ఆయన ఆ గ్రామం చేరుకున్నాడు. వేలాది గ్రామీణులు ఆయన మాటలు వినడానికి గుమి గూడారు.

రైతులు చేసిన పని చాలా అవమాన కరమైనదని జవహర్‌లాల్ వాళ్ళకు తెలియజెప్పాడు. ఆయన ఉద్రేకంతో ఉపన్యసిస్తూ—ఆ భూస్వామి ఇంటిని కొల్లగొట్టినవాళ్ళెవరో నాకు తెలిసి తీరాలి. ఏదీ చేతులెత్తండి చూద్దాం—అన్నాడు. అక్కడ పోలీసు అధికారులు ఉన్న ప్పటికీ లెక్క చేయకుండా ఇరవై నలుగురు రైతులు చేతులెత్తారు.





దానిని అవకాశంగా తీసుకుని, చేతులెత్తినవారితోపాటు వారి బంధువులనూ, మిత్రులనూ అందరినీ కలిపి దాదాపు వెయ్యమందిని పోలీసులు ఖైదు చేశారు! యేడాదిపాటు విచారణ జరిగింది. నిందితులు అనేక సంవత్సరాలు జైలుపాలయ్యారు.

తన కారణంగా అమాయకులయిన గ్రామీణులు పోలీసు అరాచకాలకు గురి అయినందుకు జవహర్‌లాల్ ఎంతగానో బాధపడ్డాడు. అయినా, ఈ సంఘటన ద్వారా గ్రామీణ రైతులు ఎంతటి నిజాయితీపరులో, ధైర్యవంతులో ఆయనకు తెలిసివచ్చింది.





రైతుకూలీల మధ్య ఇటువంటి సమావేశాలు జరగడం అంతకు పూర్వం కనీ వినీ ఎరగనివి. వీటి కారణంగా ప్రభుత్వం కొన్ని కొత్త చట్టాలు రూపొందించవలసిన నిర్బంధం ఏర్పడింది. ఈ చట్టాల ద్వారా, అంతకు పూర్వం జరిగినట్టు, దున్నే భూముల నుంచి రైతులను భూస్వాములు అంత సులభంగా తొలగించడం సాధ్యం కాకుండా పోయింది! —(ఇంకావుంది)




# అద్భుతవస్తువులు

రామాపురం అనే గ్రామంలో, సూర్యం అనే యువకు డుండేవాడు. వాడికి ఇరవై ఏళ్ళు వయసువచ్చినా, ఎలాంటి పనీ నేర్చుకోక తిని తిరుగుతూండేవాడు. వాడికి తండ్రీ, అనారోగ్యంతో బాధపడే తల్లీ, పెళ్ళీడు వచ్చిన చెల్లెలూ వుండేవారు.

ఇలా వుండగా, సూర్యం తండ్రి ఏదో వ్యాధికి గురై మరణించాడు. తండ్రి మిగిల్చిపోయిన కొద్దిపాటి డబ్బుతో రెండు మాసాలు గడిచినై.

రోజూ అన్నం వడ్డిస్తూ, వాడి తల్లి, "ఎక్కడైనా చెల్లెలికి సంబంధం చూడు, బాబూ! ఇక నేను ఆట్టేకాలం బతికేలా లేను," అంటూ కళ్ళనీళ్ళు పెట్టుకునేది.

ఈ బరువుబాధ్యతలు మోయడం అసాధ్యం అనిపించి, వాడొకనాటి రాత్రి జీవితం మీద విరక్తితో ఇల్లు వదిలి, అడవిలోకి పోయాడు.

సూర్యం అడవిలో తల వంచుకుని నడుస్తూండగా, "ఎవరా వెళ్ళేది? ఇటురా! చూడబోతే తీరనికష్టాల్లో వున్నట్టు కనబడుతున్నావు." అన్న మాటలు వినిపించినై.

ఆ మాట్లాడింది, దాపులవున్న గుట్ట మీద కూర్చున్న, ఒక ఆడపిశాచం. సూర్యం భయపడక, గుట్ట మీదికి పోయి, తన పరిస్థితి అంతా దానికి చెప్పుకున్నాడు.

అది విన్న పిశాచం కొంచెంసేపు వెక్కి వెక్కి ఏడ్చి, "ఇన్ని కష్టాల మధ్య నువ్వింకా బతికి వుండడం, ఎంత ఆశ్చర్యం!" అన్నది.

"అవును. ఏం చేయమంటావో చెప్పు!" అని అడిగాడు సూర్యం.

"నీ అదృష్టం కొద్దీ, ఇక్కడికి దగ్గిర్లో వున్న వల్లకాట్లో, ఒక పాడుపడిన బావి వున్నది. వేగిరం పోయి అందులో దూకు

మాచిరాజు కామేశ్వరరావు



దువుగా నిపద,'' అంటూ పిశాచం, సూర్యాన్ని బయలుదేరదీసింది.

సూర్యానికి, పిశాచం సలహా సబబు గానే తోచింది. వాడు పిశాచంతో, ఆ పాడుబడిన బావి దగ్గిరకు వెళ్ళి, అందులో దూకబోయాడు.

''ఎవరువాళ్ళు ? ఇంత అర్ధరాత్రివేళ, యిక్కడేం పని ?'' అంటూ ఒక ముసలి పిశాచం పైకి వచ్చింది.

సూర్యం, దానికి తన కథ అంతా చెప్పుకున్నాడు.

''పాపం, తల మునకలయ్యే కష్టాల్లో వున్నవాడు. వింటూంటే, నా గుండె తరుక్కుపోయింది. నావంతు సహాయం చేయడానికి, యిక్కడికి తీసుకు వచ్చాను,'' అన్నది ఆడపిశాచి గర్వంగా.

''అఘోరించావుగానీ, యిక వచ్చిన దారినే వెళ్ళు!'' అని ముసలిపిశాచం, ఆడపిశాచాన్ని చీవాట్లుపెట్టి పంపేసింది.

''పాపం, దాన్నేమీఅనకు. నాసమస్యకు చక్కని పరిష్కారం చూపిన ఘనత దానిదే!'' అన్నాడు సూర్యం.

ముసలిపిశాచం తల వూపి, ''సరే, నిన్నొకచోటుకు తీసుకుపోతాను. అక్కడ జరిగేదంతా, చూడు. ఆ తర్వాత, నువ్వే గంగలో దూకుతావో, అదంతా నీ యిష్టం,'' అని, సూర్యాన్ని వల్లకాటిలో మరొక ప్రాంతానికి తీసుకుపోయింది.

అక్కడ ఒక శిథిలమైపోయిన సమాధి ముందు, కొన్ని పిశాచాలు కూర్చుని వున్నవి. ముసలిపిశాచం, సూర్యాన్ని ఒక ముళ్ళపొద వెనక దాక్కోమని చెప్పి, తాను పోయి గుంపుకట్టిన పిశాచాల పక్కన కూర్చున్నది.

కొంతసేపటికి, పెద్ద అట్టహాసంగా, ఆ పిశాచాల నాయకుడు వచ్చి, శిథిలమై పోయినసమాధిమీదకూర్చున్నాడు. పిశాచాలన్నీ సంతోషంగా చప్పట్లు చరిచాయి.

పిశాచాల నాయకుడు, ఒకసారి గొంతు సవరించుకుని, ''సహచరోత్తములారా! జాగేల ? ఈ నెల రోజుల్లో, మీరు సేకరిం



చిన అద్భుతవస్తువులు ప్రదర్శించండి. ఒక సంగతి జ్ఞాపకం వుంచుకోండి. సంవత్సరాంతంలో, అత్యుత్తమ అద్భుత వస్తువు సేకరించినవారికి గొప్ప బహుమానం ఇవ్వబడుతుంది,'' అన్నాడు.

ఆ వెంటనే, ఒక పిశాచి ఖాళీబుట్ట నొక దాన్ని సమాధి మీద బోర్లించి, ''కాయలు! కూరగాయలు!'' అంటూ బుట్ట మీద బెత్తంతో మూడుసార్లు చరిచింది.

తర్వాత బుట్టను ఎత్తగానే, దాని కింద రకరకాల కూరగాయలు పోగుపడి వున్నవి.

''భేష్! భేష్!'' అంటూ మిగతా పిశాచాలన్నీ చప్పట్లు చరిచాయి.

అది చూసిన సూర్యానికి, ఆ బుట్ట తన దగ్గిర వుంటే, తన కెదురైన సమస్యలన్నీ తీరిపోయినట్టే అనిపించింది.

మరొక పిశాచి, గుండిగ నొకదానిని సమాధి మీద బోర్లించి, ''వండు, వండు! వంట వండు!'' అంటూ బెత్తంతో దాని మీద మూడుసార్లు కొట్టింది. తర్వాత గుండిగ ఎత్తగానే, దాని కింద ఘుమఘుమలాడుతూ ఎన్నో పిండివంటలు!

బుట్టకన్న, గుండిగ లాభసాటిగా తోచింది, సూర్యానికి.

ఇంకొక పిశాచం, ఒక కుండను సమాధి మీద పెట్టి, ''కావాలి, కావాలి, పాలు!'' అంటూ బెత్తాన్ని కుండచుట్టూ తిప్పింది. కుండనిండా చిక్కటిపాలు! గుండిగ కన్న, కుండతో మరింత ధనం సంపాయించవచ్చనుకున్నాడు, సూర్యం.

పిశాచాల నాయకుడు లేచి, ''నా అనుచరుల్లో, ఇంతటి ఘనులున్నారని తెలిసి గుండె పొంగిపోతున్నది. మళ్ళీ అమావాస్యనాడు సమావేశమవుదాం. లోగడ దాచినవాటి దగ్గిరే ఈ మూడు అద్భుత వస్తువుల్నీ దాచిపెడదాం,'' అంటూ వాటిని తీసుకుని, పక్కనేవున్న మర్రి చెట్టు తొర్రలో పెట్టాడు.

పిశాచాలన్నీ కోలాహలంగా, అక్కడి నుంచి వెళ్ళిపోయాయి. సూర్యం మర్రి చెట్టు దగ్గిరకుపోయి, దాని తొర్రలోంచి

కుండను బయిటికి తీశాడు. దాని కింద వాడికి గుండిగ కనిపించింది. దాన్ని బయటికి తీశాడు. తర్వాత బుట్టనూ, దాని అడుగున వున్న పిల్లనగ్రోవినీ, చెప్పులనూ, చేటనూ, బెత్తాన్నీ, గంటనూ బయటికి తీశాడు. వాటన్నిటినీ ఎలా తీసుకుపోవడమా అని, వాడాలోచిస్తూండగా, తొర్ర అడుగున ఒక గోనె సంచి కనిపించింది.

సూర్యం ఆత్రంగా దాన్ని పైకి తీసి, అద్భుతవస్తువులన్నిటినీ అందులో వేశాడు. తర్వాత అక్కడ దొరికిన, ఒక తీగతో గోనె మూతిని బిగించి కట్టి, దాన్ని భుజానికి ఎత్తుకోబోయి, తెల్లబోయాడు.

అద్భుతవస్తువులతో నిండిన ఆ గోనె కాస్తా, అదృశ్యమైపోయింది. సూర్యం పిచ్చివాడిలా దిక్కులు పరికిస్తూండగా, ముసలిపిశాచం అక్కడికి వచ్చి, "జరిగినదంతా చూశాను! నేను పాడుబడిన బావి దగ్గిర, నిన్ను చూసినప్పుడు నిరాశా పిశాచం నిన్ను ఆవహించి వున్నది. నీలో ఆశ అనే కొత్త ఊపిరిపోసి, నీచేత ఆత్మహత్యాప్రయత్నం మాన్పించడానికి— నిన్ను యిక్కడికి తీసుకువచ్చాను. అయితే, యిక్కడ నిన్ను నిరాశాపిశాచం వదిలినా, అత్యాశ అనే పిశాచం పట్టుకున్నది. అందువల్లనే, అన్ని అద్భుత వస్తువుల్నీ సొంతం చేసుకోవాలన్న ఆరాటంలో, ఏ ఒక్కదాన్నీ, నీదిగా చేసుకోలేకపోయావు!'' అన్నది.

''అవును, నిజమే! మరి యిప్పుడు నేనేం చేయాలి?" అని అడిగాడు సూర్యం.

''మనిషి పట్టుదల వహిస్తే, ఎన్ని అద్భుతాలైనా చేయగలడు. నువ్వు కూరగాయలు పండించలేవా? పిండివంటల వ్యాపారం చెయ్యలేవా? ఇన్ని గేదెలను పెట్టుకుని, వాటి పాలు అమ్మి కుటుంబాన్ని పోషించలేవా? ఆలోచిస్తే, బతకడానికి ఎన్ని మంచి మార్గాలు లేవు!'' అని ముసలిపిశాచం అదృశ్యమైంది.

ఆ మాటల్లోని సత్యాన్ని గ్రహించిన సూర్యం, కొత్త ఉత్సాహంతో ఇంటి కేసి బయలుదేరాడు.





# కృష్ణావతారం

ఇంద్రుడూ, కృష్ణుడూ ఇష్టాగోష్ఠి ముగించి, శచీదేవినీ, సత్యభామనూ వెంటబెట్టుకుని అదితిని చూడబోయారు. వారందరూ అదితికి ప్రణామాలాచరించారు. అప్పుడు ఇంద్రుడు ఆమెకు ఆమె కుండలాలు ఇచ్చేస్తూ, కృష్ణుడు నరకుడిపై చూపిన అద్భుత పరాక్రమాన్ని వివరంగా వర్ణించి చెప్పాడు.

అదితి కృష్ణుడికి అనేక వేల దీవన లిచ్చి, "నాయనా, సాటిలేని నీ భుజ బలంతో నా కష్టాలన్నిటినీ గట్టెక్కించావు. నీది అపూర్వమైన జన్మ. ఇంద్రుడి లాగే నువు కూడా దేవతలకు అండగా ఉండు. భూమి మీద నిన్నెవ్వరూ జయించలేక పోదురుగాక. స్త్రీలలో ఈ సత్యభామకు ఎవరూ ఈడు రారని ప్రసిద్ధి. నీ కీ మానవావతారం ఎంత కాలమైతే ఉంటుందో అంత కాలమూ సత్యభామకు యౌవనం నిలిచి ఉండుగాక," అని దీవించింది.

తరవాత కృష్ణుడు అదితి వద్దా, ఇంద్రుడి వద్దా సెలవు పుచ్చుకుని, గరుడ వాహన మెక్కి, సత్యభామాసమేతుడై నందనవనం మొదలుగా గల దేవోద్యానాలకు వెళ్ళి, అక్కడ విహారాలు చేశాడు. అక్కడ కల్పవృక్షా లున్నాయి; వాటి పూల మీద తుమ్మెదలు ముసురుతున్నాయి. వాటి కొమ్మలను ఉయ్యాలలు చేసుకుని దేవకన్యలు ఊగుతున్నారు. లోకాలన్నీ తిరిగి వచ్చిన సిద్ధమిధునాలు వాటి నీడన



విశ్రాంతి తీసుకుంటున్నారు. అలాటి కల్పవృక్షాల మధ్య కృష్ణుడు పారిజాతాన్ని చూశాడు. అది దేవతలకు మహాపవిత్ర మైనది. శచీదేవికి దాని మీద చాలా ప్రీతి. దాని కీర్తి మూడులోకాలలోనూ ప్రసిద్ధ మైనది. దానికి సమీపంగా వెళ్ళినవారికి జాతిస్మరణ కలుగుతుంది.

సత్యభామకు పారిజాత సౌరభం సోక గానే తాను దేవతాస్త్రీలలో అగ్రగణ్యురాల నన్న భావం కలిగింది. ఆమె ఆనందం పొందుతూ, ఆ చెట్టు తనకు కావాలని కృష్ణుణ్ణి వేడుకున్నది.

కృష్ణుడు వెంటనే పారిజాతాన్ని వేళ్ళతో సహా పెల్లగించి గరుత్మంతుడి వీపు మీద పెట్టి, బయలుదేరాడు. అప్పుడు దేవవనాలను కాపాడేవాళ్ళు అడ్డుపడి, అతనితో యుద్ధం ప్రారంభించారు. కృష్ణుడు తన బాణాలతో అవలీలగా వాళ్ళను చెండాడాడు. ఈ సంగతి ఇంద్రుడికి తెలిసింది.

కృష్ణుడు మూడులోకాలకూ రక్షకుడని తెలుసు; అతను పారిజాతం తీసుకు పోవటానికి అభ్యంతరం కూడా లేదు; అయినా ఇంద్రుడు తనను తాను నిగ్ర హించుకోలేక, దేవగణాలతో బయలుదేరి కృష్ణుడికి అడ్డం వెళ్ళి, అతనిపై వజ్రా యుధం విసిరాడు. కృష్ణుడు దాన్ని దారి లోనే ఆపేశాడు. ఇంద్రుడి ఆట కట్టింది. కృష్ణుడు జీవించి ఉన్నంతకాలమూ పారిజాతం భూలోకంలో ఉండటానికి సమ్మతించి, ఇంద్రుడు తిరిగి వెళ్ళాడు. కృష్ణుడు కూడా ద్వారకకు బయలు దేరాడు.

గరుత్మంతుడు పారిజాతంతో సహా సత్యభామా కృష్ణులను కృష్ణుడి మేడ పైభాగాన దింపాడు. కృష్ణుడు పాంచజన్యం పూరించి, తన రాక తనవారి కందరికీ తెలియబరిచాడు. అందరూ ఎంతో సంభ్రమంతో అతనివద్దకు పరిగెత్తుకుంటూ వచ్చారు. కృష్ణుడు పెద్దలకు భక్తితో నమస్కరించి, చిన్నవాళ్ళను అను

రాగంతో కౌగలించుకుని, ఆప్యాయంతో పలకరించాడు.

ప్రద్యుమ్నుడు వచ్చి పారిజాతాన్ని అంతఃపురంలో చేర్చాడు. దాని సమీపానికి వెళ్ళిన వారందరికీ ఆశ్చర్యంగా పూర్వ జన్మ జ్ఞానం కలిగింది. దాని మహత్తు చూసి అందరూ ఆశ్చర్యపోయారు. తరవాత దాన్ని తీసుకుపోయి తగిన ప్రదేశంలో నాటారు.

నరకుడి చెరలో ఉండి, పల్లకీలలో ద్వారకకు చేరిన స్త్రీలందరినీ కృష్ణుడు తానే వివాహమాడాడు.



తరవాత కృష్ణుడు గరుత్మంతుణ్ణి తగిన విధంగా సన్మానించి, అతను దేవలోకానికి తిరిగి వెళ్ళటానికి అనుమతి ఇచ్చాడు. ఎప్పుడు తలచుకున్నా రాగలనని మాట ఇచ్చి గరుత్మంతుడు దేవలోకానికి వెళ్ళి పోయాడు.

అనంతరం కృష్ణుడు సభచేసి, నరకుణ్ణి చంపి తాను సంపాదించిన వస్తువులను ఉగ్రసేనుడికీ, ఆయన భార్యకూ, తదితరులకూ పంచి, మిగిలినవి ఖజానాలో పెట్టించాడు.

సత్యభామ రోజూ పారిజాత పుష్పాలతో తనను తాను అలంకరించుకుని, తన సవతులకు కూడా పంచిపెట్టుతున్నది. తన వనంలో పారిజాతం లేకుండా పోయిందని ఇంద్రుడు మాత్రం దీనంగా శచీదేవి కేసి చూస్తూ ఉండేవాడు.

ఒకసారి దుర్యోధనుడు హస్తినాపురంలో ఒక యజ్ఞం చేసి అనేకమంది రాజులను ఆహ్వానించాడు. యజ్ఞం పరిసమాప్తమయింది. ఈ యజ్ఞానికి వచ్చిన రాజులు కృష్ణుడి విభవాన్ని గురించి ఎంతగానో విని ఉన్నవాళ్ళు కావటంచేత, ద్వారకకు వస్తామని దూత ద్వారా కృష్ణుడికి కబురుచేశారు. తప్పక రావలసిందిగా కృష్ణుడు తన దూతద్వారా వారిని ఆహ్వానించాడు. ధృతరాష్ట్రుడి నూరుగురు కొడుకులూ, వారి సామంతులూ, పాండవులూ పద్దెనిమిది అక్షౌహి



కృష్ణుడు ఒక యజ్ఞం ప్రారంభించాడు. యజ్ఞం కొనసాగుతూ ఉన్న సమయంలో ఒక పల్లెటూరి బ్రాహ్మణు డక్కడికి వచ్చి, దీక్షలో ఉన్న కృష్ణుడికి ఎదురుగా నిలబడి దీనంగా, "అయ్యా, నా మొర ఆలకించండి. నా భార్య ప్రసవించిన మరుక్షణంలోనే బిడ్డలను ఎవరో కాజేస్తున్నారు. ఈ విధంగా ఇప్పటికి మూడుసార్లు జరిగింది. ఇప్పుడు నాలుగో సారి నా భార్య గర్భవతిగా ఉన్నది. కాన్పు వచ్చే సమయం దగ్గర పడింది. మమ్మల్ని నువే కాపాడాలి," అని మొర పెట్టుకున్నాడు.

ఖుల సేనతో సహా బయలుదేరి వచ్చి, రైవతకాద్రి ప్రాంతంలో విడిశారు.

బలరాముణ్ణీ, సాత్యకినీ, ప్రద్యుమ్నుడు మొదలైన కుమారులనూ, వెంటబెట్టుకుని, కృష్ణుడు తన అతిథులను సన్మానించ టానికి వచ్చాడు. అతను అందరినీ గౌర వించి, అందరికీ బట్టలు పెట్టి, "నేనూ, నా వాళ్లూ మీవాళ్ళమే. మీకేం కావాలన్నా అడగండి, సమకూర్చుతాం," అని అందరికీ సంతోషం కలిగించాడు. వారంతా కొంతకాలం గడిపి వెళ్ళిపోయారు.

ఒకసారి అర్జునుడు ధర్మరాజు అను మతితో కృష్ణుణ్ణి చూడవచ్చి ద్వారకలో కొంతకాలం ఉన్నాడు. ఆ సమయంలోనే

ఆ మాటకు కృష్ణుడు, "ఎవరు కాపాడ మన్నా వెంటనే ఆ పని చెయ్యటం నా విధి. కాని నే నీ క్షణాన యజ్ఞదీక్షలో ఉండిపోయాను. ఏం చెయ్యాలో తోచ కుండా ఉన్నది," అన్నాడు.

ఇదంతా వింటున్న అర్జునుడు, "ఎందు కాలోచన? నన్ను పంపించరాదా? నే నీ బ్రాహ్మణుడి వెంట వెళ్ళి, ఆయనకు కలిగిన ఆపద తొలగించి, నిన్ను సంతోష పెడతాను," అని కృష్ణుడితో అన్నాడు.

కృష్ణుడు చిరునవ్వునవ్వి, "ఈ పని నీవల్ల అవుతుందా?" అన్నాడు.

అర్జునుడి కీ మాటతో తల తీసేసి నట్టయి, తల వంచుకున్నాడు. అది చూసి

కృష్ణుడు, "అయినా ఏంలే, ఒక్కడివీ వెళ్ళకు. బలరాముణ్ణీ, ప్రద్యుమ్నుణ్ణీ, మరి కొందరు యాదవవీరులనూ, సాత్యకినీ, సేననూ వెంటబెట్టుకు వెళ్ళు," అన్నాడు.

అర్జునుడు మిగిలిన యోధులనూ, పెద్ద సేననూ వెంటబెట్టుకుని, బ్రాహ్మణుడు దారి చూపుతూండగా రథంలో బయలుదేరి ఆ బ్రాహ్మణుడి గ్రామం చేరాడు.



అంతలో నక్కలు కూయటం వినపడింది. ఆకాశాన సూర్యుడి కాంతి క్షీణించి, సాయంకాలం అవుతున్నట్టనిపించింది. భయంకరమైన ధ్వనితో ఉల్క ఒకటి భూమి పైన పడింది. అదే సమయంలో బ్రాహ్మణుడి భార్యకు నొప్పులారంభమయాయి. ఆ సంగతి బ్రాహ్మణుడు వచ్చి చెప్పగా మహాయోధులందరూ విల్లులూ, బాణాలూ సిద్ధంగా పట్టుకుని పురిటింటి దగ్గిర చేరారు.

అర్ధరాత్రి అయింది. బ్రాహ్మణి ప్రసవించింది కాబోలు, చంటిబిడ్డ ఏడుపు వినిపించింది. అంతలోనే ఆడవాళ్ళు, "అయ్యో, పోయె! పోయె!" అని ఆర్తనాదాలు చేశారు. మరుక్షణంలో చంటిబిడ్డ ఏడుపు ఆకాశం దిక్కు నుంచి వినిపించింది.

అర్జునుడూ, మిగిలిన యోధులూ ఆకాశాన్ని బాణాలతో నింపేశారు. ఆకాశాన వారి కేమీ కనిపించలేదు. ఒక్క బాణం కూడా ఎవరికీ తగలలేదు, అందరూ దిగ్భ్రాంతులై, కొయ్యబారిపోయి నిలబడ్డారు.

ముసలివాళ్లూ, ముత్తవ్వలూ అర్జునుడు మొదలైన వాళ్ళను నానా మాటలూ అన్నారు. బ్రాహ్మణుడు పట్టరాని కోపంతో అర్జునుడి వద్దకు వచ్చి, "గొప్ప శూరుడిలాగా కృష్ణుడి ముందర ప్రగల్భాలాడి, కార్యభారం మీద వేసుకుని వచ్చావు. కృష్ణుడి వల్ల తప్పకాని పని నీ వల్ల అవుతుందా? నీకూ అతనికీ సాపత్య



మేమిటి? ఇంకెన్నడూ దంభాలు పలుకకు. కాపాడతానని వచ్చి, కాపాడలేక పోయావు. జరిగిన ధర్మహాని వల్ల కలిగే పాపంలో నీకు నాలుగోవంతు చెందుతుంది. నీ గాండీవం వృథా. నీ పరాక్రమం వృథా. ఇక చల్లగా వచ్చిన దారి పట్టు,'' అన్నాడు.

ఆయన వెంటనే కృష్ణుడి దగ్గిరికి మళ్ళీ బయలుదేరాడు. ఆయన వెనకగా అర్జునుడు మొదలైన వాళ్ళు కూడా బయలుదేరారు. సిగ్గుతో తల వంచుకుని, కంట తడిపెట్టుకుంటూ తన ఎదటికి వచ్చి నిలబడిన అర్జునుణ్ణి చూసి కృష్ణుడు, ''ఈమాత్రానికే ఇంత విచారం దేనికి? దీనికంతా వేరే కారణం ఉన్నది. దాన్ని నీకు తరవాత చెబుతాను,'' అని దారుకుణ్ణి పిలిచి రథం ఆయత్తపరచమన్నాడు.

దారుకుడు కృష్ణుడి రథానికి శైబ్య, సుగ్రీవ, మేఘపుష్ప, వలాహకాలనే నాలుగు గుర్రాలను పూన్చి, గరుడధ్వజం ఎత్తి తీసుకు వచ్చాడు. అర్జునుణ్ణి రథం తోలమని, కృష్ణుడూ రథంలో ఎక్కి, ఉత్తరంగా బయలుదేరాడు. రథం అరణ్యాలనూ, కొండలనూ, నదులనూ దాటి వెళ్ళి సముద్రతీరాన్ని చేరింది.

సముద్రుడు ప్రత్యక్షమై, కృష్ణుడికి అర్ఘ్యమిచ్చి, ''మహానుభావా, ఏమిటి నీ ఆజ్ఞ?'' అని అడిగాడు.

''మరేమీ లేదు. నా రథానికి మార్గం ఇయ్యి,'' అన్నాడు కృష్ణుడు.

దానికి సముద్రుడు, ''దేవా, నేను తమకు దారి ఇచ్చినట్టయితే మిగిలిన వారికి తేలిక అయిపోనా? నేను దాటరాని వాణ్ణిగా సృష్టి చేసింది తమరే గద?'' అన్నాడు.

''నాతో ఒకరికి పోటీ ఏమిటి? నేను చేసే పనులు మరొకరు చేయగలరా? నా కోసమూ, ఒక బ్రాహ్మణుడి కోసమూ నువు దారి యివ్వక తప్పదు. నేను వెళ్ళిపోయాక దారి మళ్ళీ మూసేసి, ఎప్పటి లాగే ఉండు,'' అన్నాడు కృష్ణుడు.

సముద్రుడు సమ్మతించి దారి ఇచ్చాడు. కృష్ణుడి రథం ఉత్తర కురుభూములు దాటి గంధమాదన పర్వతం కేసి వెళ్ళ సాగింది. అప్పు డతనికి ఆరు పర్వతాలు— జయంతం, వైజయంతం, నీలం, శ్వేతం, ఇంద్రకూటం, కైలాసం అనేవి—రంగు రంగుల ధాతువులతో అలంకరించి ఉన్న శరీరాలతో ఎదురై, "దేవా, ఏమిటి నీ ఆజ్ఞ?" అని అడిగాయి.

"నా రథానికి దారి ఇయ్యండి," అన్నాడు కృష్ణుడు.

అప్పుడా పర్వతాలు ఒదిగి, కృష్ణుడి రథానికి దారి ఇచ్చాయి.

మేఘాల మధ్యగా నడిచే సూర్యుడి లాగా కృష్ణుడి రథం కొండల మధ్యగా చాలా దూరం పోయేసరికి, అంతటా అంధకారం ఆవరించింది. అర్జునుడు భయపడ్డాడు. గుర్రాలు నిలిచిపోయాయి. చుట్టూ రాయి లాగా పేరుకు పోయిన అంధకారాన్ని కృష్ణుడు తన సుదర్శన చక్రంతో ముక్కలు ముక్కలు చేసి, "రథంపోనీ," అని అర్జునుడితో అన్నాడు. చాలాదూరం వెళ్ళగా, వెళ్ళగా ఎట్టె దట కోటి సూర్యుల కాంతి ఒక్కచోట పోగు చేసినట్లు కనబడింది. కృష్ణుడు రథం దిగి, ఆ కాంతిలోకి వెళ్ళిపోయాడు.

"ఈ వెలుతురేమిటి? ఇందులోకి కృష్ణుడు ఒంటరిగా ఎందుకు పోయాడు? ఏం కానున్నది?" అని అర్జునుడూ, బ్రాహ్మణుడూ భయపడుతూండగానే కృష్ణుడు ఆ కాంతిలో నుంచి తిరిగి వచ్చాడు. అతని వెంట ముగ్గురు బ్రాహ్మణ కుమారులూ ఉన్నారు. అతని చేతిలో కొత్తగా పుట్టిన శిశువు కూడా ఉన్నాడు.

కృష్ణుడా పిల్లలు నలుగురినీ బ్రాహ్మణుడి కిచ్చాడు. బ్రాహ్మణుడు పొందిన ఆనందానికీ, అర్జునుడు పొందిన ఆశ్చర్యానికీ మేరలేదు.

రథం వెళ్ళిన దారినే కృష్ణుడి ఇంటికి తిరిగి వచ్చేసింది. కృష్ణుడా బ్రాహ్మణుడికి కానుకలిచ్చి పంపి, యజ్ఞాన్ని పూర్తి చేశాడు.





# రాపాశుడు

పుళింద రాజ్యాన్ని పాలించే పురంధరుడనే రాజు ఆస్థానంలో, నలుగురు బూటకపు పండితులుండేవారు. వాళ్ళు ఏదో ఒక మిషమీద, రాజు నుంచి దానాలు పుచ్చుకుంటూ హాయిగా కాలం వెళ్ళబుచ్చుతున్నారు.

ఒకసారి వాళ్ళకు, రాజు దగ్గర పెద్ద ఎత్తున బంగారం దానంగా పుచ్చుకోవాలన్న కోరిక కలిగింది. అందుగ్గాను వాళ్ళు ఒక పథకం ఆలోచించారు.

దాని ప్రకారం పండితులు, ఒకనాడు సభతీరి వున్న రాజుతో, "మహారాజా, రాత్రి మీ జాతకం పరిశీలించాం. ప్రస్తుతం గ్రహాలు మీకు వ్యతిరేకంగా వున్నవి. త్వరలో మీ రెండు చేతులూ చచ్చుబడిపోయే ప్రమాదం వున్నది," అన్నారు.

రాజు కంగారుపడి, "ఈ గండం గడిచే మార్గం లేదా ?" అని అడిగాడు.

"లేకేం, మహారాజా ! దివ్యమైన లక్ష్మివారంనాడు బంగారుగొడ్డలితో చేతులు శ్రమించే వరకూ చెట్టు కొమ్మలు నరికి, ఆ తరవాత ఆ గొడ్డలిని పండితులైన బ్రాహ్మణులకు భక్తితో దానంగా యివ్వాలి. దానితో గ్రహాలు శాంతించి, తమకు రానున్న గండం తప్పిపోతుంది," అన్నారు పండితులు.

రాజు సభ చాలించి, మంచి పనివాళ్ళ చేత బంగారు గొడ్డలి చేయించాడు.

తర్వాత పండితులు పెట్టిన ముహూర్తం నాడు, మంగళవాయిద్యాలతో ఊరేగింపుగా ఉద్యానవనానికి వెళ్ళాడు. అక్కడ సరస్సు ఒడ్డున వున్న ఒక ఎత్తయిన చెట్టులో, కొన్ని ఎండుకొమ్మలు కనిపించాయి. రాజు చెట్టెక్కి, ఒక ఎండు కొమ్మను బంగారుగొడ్డలితో నరకసాగాడు. అలవాటు లేని కారణంవల్ల, రాజుకు

మల్లవరపు మనోహరరెడ్డి



చేతులు నొప్పి పుట్టి, గొడ్డలి పట్టుదప్పి కిందనే వున్న సరస్సులో పడిపోయింది.

ఈత తెలిసిన ఇద్దరు, ముగ్గురు సరస్సులోకి దిగబోతున్నంతలో, దూరంగా వున్న తామర ఆకుల మధ్య నుంచి, శరీరంమీద అడ్డదిడ్డంగా వున్న నల్లటిచారలు గల ఒక ఆకారం హఠాత్తుగా పైకి లేచి, చేతిలో వున్న ఇనుపగొడ్డలిని ఒడ్డుకు విసిరివేసింది.

అక్కడ చేరినవాళ్ళు, ఆ ఆకారాన్ని చూసి భయకంపితులై, "ఎవరు నువ్వు?" అని కేకవేశారు.

వెంటనే, ఆ ఆకారం, "నా పేరు, రాపా..." అంటూ నీటిలో మునిగిపోయింది.

బంగారుగొడ్డలిని, ఇనుపగొడ్డలిగా మార్చిన దాని శక్తి చూసి, రాజుతోపాటు అందరూ ఆశ్చర్యపోయారు.

రాజు తన ప్రాసాదానికి తిరిగివచ్చి, పండితులనూ, మంత్రులనూ సమావేశపరిచి, "ఒకటి, రెండు రోజుల్లో, ఆ రాపా ఎవరో తెలుసుకోండి. అలా జరక్కపోతే, అది విజృంభించి, మన కోశాగారంలో వున్న బంగారాన్ని, ఇనుముగా మార్చి, దేశాన్ని సర్వనాశనం చేయగలదు!" అన్నాడు.

రెండురోజులు గడిచాక, నలుగురు పండితులూ, రాజు దగ్గిరకు వచ్చి, "మహారాజా, ఈ రెండు రోజులూ ఎంతగానో శ్రమించి, మరొకసారి అనేక గ్రంథాల్లోని విషయాల్ని తరచి చూశాం. వాడు రాపా కాదు; రాపాశుడనే రాక్షసుడు! వాణ్ణి గురించిన ప్రస్తావన దేవదానవుల సాగరమథన కాలం నుంచీ వున్నదే. త్రేతాయుగంలో కూడా, ఈ రాపాశుడు ఒక చోట కనిపిస్తాడు. వాడు కేవలం జిత్తులమారే కాదు, క్రూరాతిక్రూరుడు," అని చెప్పారు.

రాజు హడలిపోయి, వివిధ దేశాల నుంచి పేరుమోసిన మాంత్రికులను పిలిపించి, కోట చుట్టూ, కోశాగారం చుట్టూ కాపాలా వుంచాడు. పూజలు చేయించి



నగరవాసు లందరికీ తాయెత్తులు కట్టించాడు. రాపాశుడిని చంపినవారికి పెద్ద ఎత్తున బహుమతి ప్రకటిస్తూ, దేశం నలు మూలలా చాటింపు వేయించాడు.

ఇది జరిగిన మర్నాడు, రాజుగారి వంటవాడు, రాజు భోజనం ముగించి విశ్రాంతిగా కూర్చున్న సమయంలో అయన దగ్గిరకు వచ్చి, ''ప్రభూ, క్షమిస్తానంటే, ఈ రాపాశుడి రహస్యం నేను బయటపెట్టగలను,'' అన్నాడు.

''అలాగే క్షమిస్తాను. కాని, అంత భయంకరుడైన రాపాశుడి రహస్యం, నీ కెలా తెలుసు ?'' అన్నాడు రాజు.

''మన పాకశాలను శుభ్రపరిచే వాడొకడున్నాడు; వాడి పేరు రంగడు. వాణ్ణి యిప్పుడే పిలుచుకు వస్తాను,'' అంటూ వంటవాడు వెళ్లి, రంగడితో తిరిగివచ్చాడు.

రంగడు వస్తూనే రాజు పాదాలకు నమస్కరించి, ''ప్రభూ, నన్ను క్షమించాలి!'' అంటూ గడగడ వణకసాగాడు.

రాజుకు వాడి మాటలు అర్థంకాక, ''నువ్వేం నేరం చేశావు? ఎందుకు క్షమించాలి ?'' అని అడిగాడు.

''ప్రభూ, నేనే రాపాశుణ్ణి!'' అన్నాడు రంగడు.

''బంగారుగొడ్డలిని, ఇనుపగొడ్డలిగా మార్చిన, ఆ భయంకరుడైన రాక్షసుడు రాపాశుడివి, నువ్వా ? నీకేమైనా వెర్రెత్తిందా ?" అని అడిగాడు రాజు కోపంగా.

అప్పుడు వంటవాడు కల్పించుకుని, ''ప్రభూ, నేను చెప్పేది సావధానంగా ఆలకించండి. అంతా తమకే అవగతమైపోతుంది,'' అన్నాడు.

వంటవాడు చెప్పిందేమంటే: ఆ రోజు రంగడు మామూలుగా పాకశాలను శుభ్రపరిచి ఒంటికైన మసిని కడుక్కునేందుకు వెళ్ళబోతుంటే, పంటవాడు వాణ్ణి ఆపి, ''ఒరే రంగడూ, ఈ పచ్చికట్టెలు మండక, వంటవేళ మించిపోయేట్టుంది. ఆ ఉద్యానంలో యిన్ని ఎండుకొమ్మలు నరికి తెచ్చి పుణ్యంకట్టుకో!'' అన్నాడు.

రంగడు అలాగే ఒంటికైన మసితోటే, భుజాన గొడ్డలి వేసుకుని ఉద్యానంలోకి వెళ్ళాడు. వాడికి సరస్సుమీదికి వంగి వున్న చెట్టుకు, ఒక ఎండుకొమ్మ కనిపించింది. వాడు చెట్టు ఎక్కి, ఆ కొమ్మను నరకబోతున్నంతలో, దూరంగా మంగళ వాయిద్యాలతో వస్తున్న రాజు కనిపించాడు. ఆ సమయంలో రాజుకంటబడితే శిక్షిస్తాడన్న భయంతో, గజఈతగాడు కావడం వల్ల, సరస్సులోకి దూకి, తామరఆకుల చాటున దాక్కున్నాడు.

అంతలో రాజు అక్కడికి వచ్చి, చెట్టు కొమ్మను నరుకుతూ, బంగారుగొడ్డలిని సరస్సులోకి జారవిడిచాడు. అది చూసి రాజువెంట ఉన్నవాళ్ళు, గొడ్డలికోసం సరస్సులోకి దిగబోయారు. వాళ్ళవల్ల తన గుట్టు రట్టవుతుందన్న భయంతో రంగడు, తన ఒంటికి యింకా కొంత మసి పట్టి వుండవచ్చనీ, తనను ఎవరూ గుర్తించలేరనీ అనుకుని, నీటిపైకి వచ్చి, తనచేత వున్న ఇనుపగొడ్డలిని ఒడ్డుకు విసిరాడు. ఆ సమయంలో తన పేరడిగినవాళ్ళకు, రాజుగారి పాకశాల ఊడ్చే రంగణ్ణని చెప్ప బోయి, తడబాటుకొద్దీ రాపా అని నీటమునిగి ఈదుకుంటూ అవతలి ఒడ్డు చేరాడు.

అంతా విన్న రాజు, ఒకసారి పెద్దగా నవ్వి, "ఒరే, రంగా! పండితులు చెప్పిన, త్రేతా యుగం నాటి భయంకరుడైన రాపాశుడనే రాక్షసుడివి, నువ్వన్నమాట! సరే, ఆ బంగారుగొడ్డలిని, ఏ రాక్షసుడో ఎత్తుకుపోలేదు. దానికోసం సరస్సులో వెతికిద్దాం," అన్నాడు.

"ప్రభూ, దానికోసం వెతికించనవసరం లేదు. ఆ రాత్రే రంగడు సరస్సులో దిగి, దాన్ని వెతికి పట్టుకుని, నాకు తెచ్చియిచ్చాడు," అంటూ వంటవాడు పాకశాల నుంచి దాన్ని పట్టుకువచ్చి రాజుకిచ్చాడు.

రాజు రంగడికి తన మెడలోని వజ్రాల హారం బహూకరించి, తమ స్వప్రయోజనంకోసం, తనను తప్పుదారి పట్టిస్తున్న బూటకపు పండితులు నలుగుర్నీ కఠినంగా శిక్షించాడు.





# చేపల పంట

కైరోనగరంలో గోహా అనే ప్రసిద్ధహాస్యగాడు ఒకాయన ఉండేవాడు. ఆయనకు ఒకప్పుడు తోటపని మీద ఆసక్తి కలిగింది. అందుచేత తన పెరడుయావత్తూ తవ్వి, రకరకాల పూలమొక్కలు నాటి పాదులు పెట్టి, ఎరువు వేసి, శ్రద్ధగా పెంచసాగాడు.

తోటపనిలో గోహాకు కలిగిన ఆసక్తి గమనించి ఆయనకు మిత్రులు సలహాలిచ్చారు, చేతనయినవారు సాయం చేశారు. కొద్ది కాలంలోనే గోహా తన పెరడులో అందమైన పూలు పూయించసాగాడు.

ఒకనాడు ఒక సంపన్నుడు, గోహాను చూడవచ్చేసరికి గోహా తోటలో కలుపు తీస్తూ కనిపించాడు.

"ఇటీవల నువు గొప్ప తోటమాలివి అయావని విన్నాను. కాని నీ తోటలో కొత్తరకం మొక్కలేమీ ఉన్నట్టు లేదే?" అన్నాడు సంపన్నుడు.

"దొరికిన విత్తనమల్లా వేసి చూస్తూనే ఉన్నాను. కొత్తమొక్కలు లేకపోతే అది నా తప్పు కాదు," అన్నాడు గోహా.

"కొత్తవిత్తనాలు కావాలంటే నేనే ఇస్తాను గాని, వాటిని మొలిపించటం నీవల్ల కాదేమోనని నా అనుమానం," అన్నాడు సంపన్నుడు.

"అటువంటి భయమేమీ వద్దు. నేను ఎలాటి విత్తనాలనైనా మొలిపిస్తాను!" అన్నాడు గోహా.

"అయితే రేపు ఉదయం మా నౌకరు చేత విత్తనాలు పంపుతాను. వాటిని మా అల్లుడు బాగ్దాదు నుంచి ఇటీవల పంపాడు. నాకు తోటపని మీద ఆసక్తి లేక వాటిని అలాగే పొట్లం కట్టిపెట్టాను," అన్నాడు సంపన్నుడు.

మర్నాడు ఉదయం సంపన్నుడి నౌకరు వచ్చి గోహాకు ఒక పొట్లం ఇచ్చి, "దీనిని

ఈజిప్టు జానపద కథ



మా యజమాని మీకిమ్మన్నారు. వీటిని ఎంతో జాగ్రత్తగా మొలకెత్తించమన్నారు,'' అని చెప్పాడు.

గోహా పొట్లం విప్పి చూసి, ''ఇవి ఏ బాపతు విత్తనాలో మీయజమాని చెప్పాడా ?'' అని నౌకరును అడిగాడు.

''ఆయనకే తెలియదుట. మొక్కలు పెరిగాక ఆయన వచ్చి చూస్తానని చెప్పమన్నారు,'' అని చెప్పి నౌకరు వెళ్ళిపోయాడు.

తోటపని చేసేవారు సాధారణంగా తమకు తెలియని విత్తనాలు కనిపించినప్పుడు ఒకటి నోట్లో వేసుకుని, మునిపంట కొరికి రుచిచూస్తారు. గోహా కూడా ఆ పనే చేసి సంపన్నుడు చేసిన మోసం గుర్తించాడు.

అవి విత్తనాలు కావు; ఎండబెట్టిన చేప గుడ్లు. తనను వేళాకోళం చెయ్యటానికే సంపన్నుడు వాటిని నాటమని పంపించాడు! దీనికి ఏదో విధంగా ప్రతిక్రియ చేయాలని గోహా నిశ్చయించుకున్నాడు.

రెండు వారాలు గడిచింది. గోహా బజారుకు వెళ్లిన సమయంలో సంపన్నుడు ఎదురుపడి, ''ఏం, గోహా ? గులాబీలు కులాసాయేనా ?'' అన్నాడు.

''మీ దయవల్ల ఈ యేడు అవి ఆకు కనపడకుండా పూశాయి!'' అన్నాడు గోహా.

''అన్నట్టు, నేను పంపిన విత్తనాలు నాటావా ?'' అన్నాడు సంపన్నుడు.

''అప్పుడే నాటానే !'' అన్నాడు గోహా.

సంపన్నుడు నవ్వు ఆపుకుంటూ, ''బహుశా మొలకెత్తి ఉండవు ! వాటిని మొలకెత్తించటం మామూలు తోటమాలులకు సాధ్యమయే పని కాదని మా అల్లుడు అన్నాడులే !'' అన్నాడు.

''ఆ పప్పులు మన దగ్గిర ఉడకవు. చెయ్యవలిసినట్టు పాదుచేసి, వెయ్యవలిసిన ఎరువువేసి, విత్తులునాటి జాగ్రత్తగా కాపాడితే ఏ విత్తనాలైనా మొలుస్తాయి ! మీరు పంపిన విత్తనాలు ఇప్పుడిప్పుడే మొలకలెత్తుతున్నాయి. వాటికి దిష్టి,

ఎండా తగలరాదు. అందుచేత పిడతలు కప్పి ఉంచాను. రేపు ఉదయం మా యింటికి దయచెయ్యండి. చూద్దురు గాని!'' అన్నాడు గోహా.

సంపన్నుడు వెలాతెలాబోతూ, ''అలాగే వస్తాను!'' అని తన దారిన వెళ్ళాడు.

గోహా చేపల దుకాణానికి వెళ్ళి ఒక పావుశేరు చిన్నచేపలు కొని ఇంటికి పట్టుకెళ్ళాడు. ఆయన తన చిన్నకొడుకును పిలిచి, ''ఒరే, ఈ చేపలను మూతులు పైకి కనపడేటట్టుగా మన పెరడులో ఒక బారున సగంసగానికి పాతిపెట్టి వాటిపైన పిడతలు మూసిపెట్టు,'' అన్నాడు. కొడుకు అలాగే చేశాడు.

మర్నాడు ఉదయం సంపన్నుడు వచ్చాడు. గోహా ఆయనను వెంటపెట్టుకుపోయి పిడతలు చూపించి, ''మొక్కలు వాటికింద ఉన్నాయి,'' అంటూ ఒక పిడత ఎత్తి చూపాడు. నేలలో నుంచి మొలుచుకు వస్తున్నట్టుగా చేప ఒకటి కనపడింది.

గోహా పిడతలన్నీ ఎత్తిచూపినాక సంపన్నుడికి తల తిరిగినట్టయింది. ''ఆశ్చర్యం! అద్భుతం! నిన్న కూడా నీ మాటలు నేను నమ్మలేదు. ఇప్పుడైనా నా కళ్ళతో చూశాను గనక నమ్ముతున్నాను గాని లేకపోతే నమ్మను!'' అన్నాడు.

''ఈ విత్తనాలు మొలిపించటం ఏమీ కష్టం కాదు. నాకే పది ఎకరాలుంటే పంట పండించేద్దును!'' అన్నాడు గోహా.

''ఆ పని నేనే చేస్తాను!'' అంటూ సంపన్నుడు ఇంటికి వెళ్ళి తన నౌకర్లను పిలిచి, ''ఒరే, మీరు ఈ యేడు మన పొలాలలో ఎండిన చేపగుడ్లు చల్లండి!'' అన్నాడు. వాళ్ళు అలాగే చేశారు.

ఈ సంగతి విన్న ఊరివాళ్ళు, సంపన్నుడు కనిపించినప్పుడల్లా చాటుగా నవ్వుకోసాగారు. కొద్ది రోజుల్లోనే ఆయనకు జరిగిందేమిటో అర్థమైంది. గోహాను పరాభవం చెయ్యబోయినందుకు తనకు ప్రాయశ్చిత్తంబాగా జరిగిందని సంపన్నుడు తెలుసుకున్నాడు.





# మానవసహాయం

ఒకప్పుడు మలయ తీరంలో ఒక యోధాన యోధు డుండేవాడు. అతని సాహస చర్యలూ, అద్భుత పరాక్రమమూ గురించి దేశదేశాల వాళ్ళు కథలు చెప్పుకునే వారు.

ఒకనా డతను సముద్ర తీరాన పచార్లు చేస్తూండగా, ఒక మహాకాయుడు సముద్రంలో నడుస్తూ అతని కేసి వచ్చాడు. ఆ మహాకాయుడు ఒడ్డుకు వచ్చాక యోధానయోధు డతన్ని పలకరించి, "ఎవరు నువు? సముద్రం దాటి ఇటుగా ఎందు కొస్తున్నావు?" అని అడిగాడు.

"నేను మహాకాయ ద్వీపం నుంచి వస్తున్నాను. మా రాజుగారు యోధాన యోధుడి కొక కబురు చెప్పమని పంపారు," అన్నా డా మహాకాయుడు.

"ప్రస్తుతం ఆ యోధుడు అడవికి వేటకుపోయి ఉన్నాడు. అతనితో ఏం చెప్పాలో చెబితే, రాగానే చెబుతాను," అన్నాడు యోధుడు.

"మహారాణిగారు ప్రసవించబోతున్నది. లోగడ ఆమె ఇద్దరు మగ పిల్లలను కన్నది. పురిటి లోనే ఆ ఇద్దరు పిల్లలనూ ఎవరో దొంగలు ఎత్తుకుపోయారు. ఈసారి పుట్టబోయే బిడ్డను కాపాడటానికి యోధాన యోధుడు రావాలని మా రాజుగారి కోరిక. వెనక బిడ్డలు పుట్టినప్పుడు రాజుగారి కోట లోపలా, వెలపలా కూడా బలమైన రక్షణలు ఏర్పాటు చేశారు. అయినా దొంగలు రానేవచ్చారు, పిల్లలను ఎత్తుకు పోయారు. వాళ్ళెవరో, ఎటుగా వచ్చారో, పిల్ల లేమయారో, కొంచెం గూడా తెలియ రాలేదు," అన్నాడు మహాకాయుడు.

"సరే, యోధానయోధుడు తిరిగి వచ్చాక ఈ సమాచారం అతనితో చెబుతాను," అన్నాడు యోధుడు.



మహాకాయుడు అతని వద్ద శలవు పుచ్చుకుని సముద్రం లోకి వెళ్ళి పోయాడు.

మర్నాడు ఉదయం యోధానయోధుడు అదే ప్రాంతంలో పచార్లు చేస్తూ ఉండగా అతనికి ఎనిమిదిమంది బుడత మనుషులు పరిగెత్తే ఆటలాడుతూ కనిపించారు. అతను వాళ్ళను పలకరించి, "ఎవరు మీరు? మీ రేం పని చేస్తారు?" అని అడిగాడు.

"మేం బుడతలం. తలా ఒక పనీ చేస్తాం. నా మటుకు నన్ను చట్రాయి అంటారు. నేను చతికిలబడ్డానంటే నన్నెవరూ కదిలించలేరు," అన్నాడు బుడతల్లో ఒకడు.

"ఏదీ, కూర్చో చూస్తాం," అన్నాడు యోధానయోధుడు. చట్రాయి నేల మీద చతికిలబడ్డాడు. యోధానయోధుడు వాణ్ణి కొంచెం కూడా కదిలించలేక పోయాడు. అతను ఆశ్చర్యపడి మిగిలిన వాళ్ళ శక్తులను గురించి కూడా అడిగాడు.

ఒకడి పేరు దివ్యకర్ణి; వాడు సముద్రం అవతల మాట్లాడుకున్నా ఆలకించగలడు. మరొకడు దూరస్పర్శి; వాడు సముద్రం అవతల చీమ చిటుక్కుమంటే తెలుసుకో గలడు. నాలుగోవాడు మహాజ్ఞాని; వాడికి ప్రపంచంలో ఎక్కడ ఏది జరుగుతున్నదీ తెలుస్తుంది. అయిదోవాడు లఘుహస్తి; వాడు కోడి పొదిగే గుడ్డును కోడికే తెలియ రాకుండా కాజెయ్యగలడు. ఆరోవాడు ఆరోహకుడు; వాడు ఈగలు పాకలేని నున్నని గోడలు కూడా ఎగబాకగలడు. ఏడోవాడు విలుకాడు; వాడు వంద రెక్కల పురుగులు ఎగురుతుంటే, వాటిలో కావాలన్న దాన్ని బాణంతో కొట్టగలడు. ఎనిమిదోవాడు దారుబ్రహ్మ; వాడి చేతి కొక కర్ర ఇస్తే, దానితో వాడు చెయ్య లేనిది లేదు.

"భేష్, ఒక ఓడ తయారు చెయ్యాలంటే, నీ కెంత కాలం పట్టుతుంది?" అని యోధానయోధు డడిగాడు.



"నువు ఒక్కసారి గుండ్రంగా తిరిగే టంత సేపు," అన్నాడు దారుబ్రహ్మ.

యోధానయోధుడు నిలబడినచోటనే ఒక్కసారి గుండ్రంగా తిరిగాడు. అతని వీపు సముద్రం కేసి ఉండే క్షణంలో దారుబ్రహ్మ ఒక కర్రపుల్లను సముద్రపు నీటి మీదికి విసిరాడు. యోధానయోధుడు మళ్ళీ సముద్రం కేసి తిరిగే సరికి ఒక పెద్ద ఓడ సిద్ధంగా ఉన్నది.

"నేను సముద్రం మీద, మహాకాయుల దీవికి వెళ్ళబోతున్నాను. మీరంతా నా వెంట వచ్చి నాకు సహాయం చేస్తారా?" అని యోధానయోధుడు బుడతళ్ళను అడిగాడు.

"సహాయం చేస్తాం. తూర్పు దేశాలలో మాకు తెలీని విషయం లేదు," అన్నారు వాళ్ళు. యోధానయోధుడు ఎనిమిది మంది బుడతళ్ళనూ ఓడలో ఎక్కించుకుని ప్రయాణమై, త్వరలోనే మహాకాయులుండే దీవిని చేరాడు. మహాకాయుల రాజు, యోధానయోధుడు వచ్చినందుకు పరమానందం చెంది, అతనికీ అతని అనుచరులకూ ఘనమైన స్వాగతం ఇచ్చాడు. ఆయన యోధానయోధుడితో, "మీరు సమయానికి వచ్చారు. ఇవాళే రాణి ప్రసవించింది. ఆమె ప్రసవించిన మొదటి పిల్లలిద్దరూ పుట్టినరోజు రాత్రే మాయమయారు. ఈ పిల్లవాడికి కూడా ఈ రాత్రే ప్రమాదం ఉన్నది," అన్నాడు.

"మీ రేమీ భయపడకండి, నేనూ, నా అనుచరులూ ఈ రాత్రి మీ బిడ్డను కాపాడతాం. కాపాడలేని పక్షంలో మీరు నా తల తీసేయించవచ్చు," అన్నాడు యోధానయోధుడు.

రాజభవనంలో మంచి ఇనపపెట్టెలాటి గది చూసి, అందులో చంటిబిడ్డనూ, ఇద్దరు దాదులనూ ఉంచి, యోధానయోధుడూ, అతని అనుచరులూ కాపున్నారు.

మహాజ్ఞాని యోధానయోధుడితో, "బిడ్డను కాపాడలేకపోతే నీ తల ఇస్తా



ననటం పొరపాటయింది. ఈ బిడ్డను ఈ రాత్రి మనం కాపాడలేం. దొంగతనం జరిగి తీరుతుంది,'' అన్నాడు.

''అలాగా! ఆ బిడ్డను ఎవరు ఎత్తుకు పోతారో చెప్పు,'' అన్నాడు యోధుడు.

''దొంగ ఈ రాజు చెల్లెలే. ముందు పుట్టిన పిల్లలను కూడా ఆమే ఎత్తుకు పోయింది. ఈ అన్నా చెల్లెళ్ళ మధ్య బద్ధ శత్రుత్వం. చెల్లెలు మంత్రాలు నేర్చినది. అదృశ్య రూపంలో కోట ప్రవేశించి, పొగగూడు నుంచి రహస్యంగా గదిలోకి చెయ్యి చాచి బిడ్డలను కాజేసింది.'' అన్నాడు మహాజ్ఞాని.

ఆ మాట వింటూనే చక్రాయి పొగగూడు కింది భాగంలో చతికిలబడి, ''ఆ పొగ గూడు కుండా చెయ్యి పెట్టిందో, ఆ చేతిని మరి తీసుకోలేదు,'' అన్నాడు.

అందరూ ఎవరి స్థానాల్లో వారు కూర్చున్నారు. అర్ధరాత్రి దాటాక దివ్యకర్ణి, ''మహాకాయమహారాజు చెల్లెలు తన కోట నుంచి బయలుదేరుతున్నది. మొదట దొంగిలించిన పిల్లలిద్దరినీ జాగ్రత్తగా చూసుకోమని తన నౌకర్లతో అంటున్నది,'' అన్నాడు.

''ఆమె తన ఇంటికప్పు కుండా పైకి వస్తున్నట్టున్నది. ఆమె ఇంటికి ద్వారాలూ, గవాక్షాలూ లేవు. ఆమె కోట గోడలు గాజు లాగా నున్నగా ఉన్నాయి,'' అన్నాడు దూరస్పర్శి.

కొంచెం సేపయాక దివ్యకర్ణి, ''వచ్చేసింది! కాపలావాళ్ళకు కనపడకుండా కోటలోకి జొరబడింది,'' అన్నాగు.

మరి కొద్ది క్షణాలలో పొగగూడు కుండా ఒక నల్లని చెయ్యి కిందికి దిగి రాసాగింది. అది కంటపడగానే చక్రాయి చప్పున ఆ చేతిని పట్టేసుకున్నాడు. చెయ్యి తీవ్రంగా పెనుగులాడింది, కాని ప్రయోజనం లేకపోయింది. చివరకు చెయ్యి ఊడి వచ్చేసింది. చక్రాయి ఆ చేతిని గదిలోకి లాగేశాడు. యోధుడూ, మిగిలిన బుడతళ్ళూ, దాదులూ ఆత్రంగా

ఆ చేతి చుట్టూ మూగి ఆశ్చర్యంగా చూడ సాగారు.

వాళ్ళందరూ ఆ సందడిలో ఉన్న సమయంలో రాక్షసి తన రెండో చేతిని గదిలోకి పెట్టి, ఉయ్యాల తొట్టెలో ఉన్న పిల్లవాణ్ణి కాజేసి తీసుకుపోయింది.

దాదులు తొట్టెకేసి తిరుగుతూనే, "అయ్యో, బిడ్డ!" అన్నారు.

"మనం ఓడలో ఎక్కి పారిపోవటం మేలు. తెల్లవారగానే ఈ రాజు మన తలలు తీసేస్తాడు," అన్నారు బుడతళ్ళు.

"ఎందుకు పారిపోవటం? ఆ రాక్షసి వెన్నంటిపోయి, రాజుగారి ముగ్గురు బిడ్డలనూ తీసుకొద్దాం," అన్నాడు యోధానయోధుడు.

అందరూ కోట బయటికి వచ్చి, తమ ఓడలో రాక్షసి ఉండే తీరానికి చేరారు. ఆరోహకుడు లఘుహస్తిని తన భుజాల మీద ఎక్కించుకుని గబగబా కోట గోడ ఎక్కేసి, లఘుహస్తిని కోటలో దించాడు. లఘుహస్తి లోపలి నుంచి మహాకాయ మహారాజు కొడుకులను ముగ్గురినీ ఆరోహకుడికి వరసగా అందించాడు. అందరూ ఓడలో మహాకాయుల దీవికి తిరిగివచ్చారు.

వారింకా చేరకముందే రాక్షసి, పిల్లలు మాయం కావటం తెలుసుకుని ఓడను వెంబడించి రాసాగింది. ఆమె ఎంత దూరం లోకి వచ్చినదీ దూరస్పర్శి ఎప్పటికప్పుడు చెబుతూనే ఉన్నాడు. చూపు మేరలోకి రాగానే విలుకాడు, బాణం వదిలి, ఆమె నుదుట ఉన్న ఒక్క కంటినీ కొట్టేశాడు. ఆ దెబ్బతో ఆ రాక్షసి చచ్చి సముద్రంలో పడిపోయింది.

తెల్లవారగానే మహాకాయ మహారాజు పురిటిగదికి పరిగెత్తుకుంటూ వచ్చి, తన ముగ్గురు పిల్లలనూ చూసి ఆశ్చర్యంతో మూర్ఛపోయినంత పని చేశాడు. ఆయన వారం రోజులపాటు తన అతిథులకు బ్రహ్మాండమైన విందులు చేసి, వారి ఓడ అంతా బహుమానాలతో నింపేసి, యోధానయోధుణ్ణీ, బుడతళ్ళనూ సాగనంపాడు.




దర్జీపిట్ట
గూడు నిర్మించడానికి రెండు విడివిడి ఆకులను ఒకటిగా కలిపి దర్జీలాగా కుట్టడంవల్ల ఈ పిట్టకు దర్జీపిట్ట అంటారు. ఇవి రెండు ఆకుల అంచులలోనూ దగ్గర దగ్గర చిల్లులు చేసి, సన్నిటి దారాలతో ఒకటిగా కలిపి కుడతాయి. ఆకుల మధ్య భాగాన్ని చిన్న చిన్న మెత్తటి మొక్కలతోనూ, గడ్డిపోచల తోనూ నింపి అందమైన గూడు కట్టుకుంటాయి.


ఎత్తయిన జలపాతం!
వెనిజులాలోని 3,212 అడుగుల ఎత్తయిన ఏంజల్ జలపాతమే ప్రపంచంలోకెల్లా చాలా ఎత్తయినది. 1935వ సంవత్సరంలో ఆ జలపాతం కనుగొనబడినది.


డాల్ఫిన్ 'మాటలు'
మనిషికన్నా పదింతలు వేగంగానూ, గట్టిగానూ డాల్ఫిన్ చేపలు 'మాట్లాడ' గలవు :

# మీ పాపాయికి
# అందించండి సెరిలాక్ లాభం



## తొలిసారిగా ఘన పదార్థాలను ఇస్తూ

4 నెలల నుంచీ మీ పాపాయికి, పాలతోబాటు ఘన పదార్థాలు కావాలి. సెరిలాక్ లాభాన్ని అందించండి.

పోషకాహార లాభం : సెరిలాక్ ప్రతి మోతాదులోనూ మీ పాపాయికి కావలసిన పోషక పదార్థాలు, ప్రొటీన్లు, కార్బోహైడ్రేట్లు, కొవ్వు పదార్థాలు, విటమిన్లు, ఖనిజాలూ అన్నీ వున్నాయి. అన్నీ సమ పాళల్లో వున్నాయి.

రుచి లాభం : పాపాయిలకు సెరిలాక్ రుచి ఇష్టం.

సమయం ఆదా లాభం : సెరిలాక్ ముందుగా వండినది. దానిలో పాలూ, పంచదార వున్నాయి. దానిని వెచ్చటి నీటితో కలిపితే చాలు.

ఎంపిక లాభం : ఎంచుకునేందుకు మూడు రకాల సెరిలాక్ వుంది.

మీ పాపాయికి సమతూకంలో పోషకాహారాన్ని అందించేందుకూ, తయారుచేయటంలో పరిశుభ్రతను పాటించేందుకూ, డబ్బా మీది సూచనలను జాగ్రత్తగా పాటించండి.



6 మాసాల నుంచి



4 మాసాల నుంచి



6 మాసాల నుంచి

ఉచితం
సెరిలాక్ బేబీ కేర్ బుక్
వ్రాయండి: సెరిలాక్
పోస్ట్ బాక్స్ నెం 3
న్యూ ఢిల్లీ 110008




సెరిలాక్ రక్షణ: పోషకాహారంతో పరిపూర్ణం-ఎంతో రుచికరం

R.K. SWAMY/FSL/5112/TEL

## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1989 జూలై నెల సంచికలో ప్రకటింపబడును.



S. G. Seshagiri



A. L. Syed

★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్కమాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ మే నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/–లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి :– చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

### మార్చి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : అద్దంలో చూసేది అందం! రెండవ ఫోటో : గాజులతో పొందేది ఆనందం!!

పంపినవారు : వి. చాముండేశ్వరి, తిరువత్తియూర్, మద్రాసు—19.

బహుమతి మొత్తం రు. 50/– నెలాఖరులోగా పంపబడుతుంది.


## చందమామ

ఇండియాలో సంవత్సర చందా : రూ. 36-00

చందా పంపవలసిన చిరునామా :

డాల్టన్ ఏజన్సీస్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600 026.

ఇతర దేశాల చందా వివరాలకు రాయండి :

చందమామ పబ్లికేషన్స్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600 026

Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.


---

# LUSCIOUS MANGOES MADE INTO FRUIT BARS



Packed to preserve their freshness




nutrine

# Naturo

**MANGO FRUIT BAR**

Now, it's Mango Season
Twelve Months a Year
So Convenient... So Delicious!






sesh/NC/8830